# ఆంధ్రపత్రిక

317244




The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 233 FRIDAY 26th NOVEMBER 1948 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao


# కాశ్మీర్ యుద్ధాన్ని తీవ్రతరంచేయక తప్పదని పాకిస్థాన్ మంత్రి బెదిరింపు

## సుఛౌకు తూర్పు, దక్షిణదిశలగా చైనా ప్రభుత్వ సేనల విజృంభణ

### జాంభువాన్‌పై కమ్యూనిస్టు చక్రబంధ విచ్ఛేదన

నాంకింగ్, నవంబరు 25: చైనా ప్రభుత్వ కాల్బలదళములు భారీ కవచ శకటముల సహాయముతో సుఛౌ నగరమునకు తూర్పుదక్షిణ దిశలగా విసనకర్ర ఆకారములో విస్తరించి ముందుకు సాగుచున్నవని నేటివార్తలు తెలుపుచున్నవి. ప్రభుత్వసేనల సప్తమ దళముపై జాంభువాన్ నగరమున కమ్యూనిస్టులు ప్రయోగించిన చక్రబంధమును ఛేదించిన పిమ్మట ఈ అప్రతిహత పురోగమనము ప్రారంభమైనది. జాంభువాన్ నగరము శత్రుముట్టడినుండి విముక్తి పొందినది.

సుఛౌకు తూర్పుగా 20 మైళ్లలోవున్న తాష్వీబియాను ప్రభుత్వసేనలు నిన్న తిరిగి వశపరుచుకున్నవి. మరికొన్ని ప్రభుత్వసేనలు బ్రహ్మాండమైన టాంకు దళముల సహాయముతో సుఛౌకు దక్షిణముగావున్న సుక్సీన్ పట్టణమునకు కనుచూపుమేరలోనికి చేరగలిగినవి. సుక్సీన్ నాంకింగ్ రైలుమార్గములో వున్నది. ప్రభుత్వ సైనికదళముల తీవ్రవత్తిడి భరించలేక ఈ ప్రాంతమున కమ్యూనిస్టులు వాయువ్యదిశగ పలాయనము చిత్తగించుచున్నారు.

సుఛౌకు 50 మైళ్ళు ఉత్తరంగావున్న సుక్షీన్ ఆసే-రైల్వే పట్టణమునుండి కమ్యూనిస్టులను తుడిచివేసితిమని ప్రభుత్వసేనలూ, 18 ప్రభుత్వ దళములను పచ్చడిచేసి, సుఛౌనగరమును ఆక్రమించుటకు బ్రహ్మాండంగా తలపడుచున్నామని కమ్యూనిస్టులూ నేడు ఒకరికి ప్రతిగా మరొకరు ప్రకటించిరి.

#### ఉత్తర చైనాలో యుద్ధసన్నాహాలు

ఉత్తర చైనాలో ప్రభుత్వమునకు మిగిలిన ఆఖరిబలీయ కేంద్రములు టీంట్సిన్ పీపింగ్‌లపై భారీయెత్తున ముట్టడి జరుపుటకు కాచుకొనియున్న 50 వేల కమ్యూనిస్టు సేనలకు సరఫరా చేసేటందుకు "బృహత్కుడ్యము" లోని ఖాళీలగుండా కమ్యూనిస్టు ఆయుధ సరఫరా సేనలు ప్రవాహంవలె వస్తున్నవని వార్తలు తెలుపుచున్నవి.

సుఛౌ యుద్ధరంగంలోనికి అతి సమర్థమైన అమెరికన్ శిక్షితమైన తాయ్‌వాన్ సేనలనుదించుటకు చాంగ్‌కైషేక్ ఆలోచించుచున్నట్లు తెలియుచున్నది. కాని ఈ సేనలింతవరకూ యుద్ధముఖమేఎరుగవట.

#### చైనా వైమానికుల మృతి

షాంఘే, నవంబరు 25: సుఛౌ విమానాశ్రయమునుండి మందుసుండు సామగ్రితో తిరిగి పోవుచుండగా వాటిలో ఒకదానిలో వున్న బాంబు ప్రేలినందున విమానములు రెండునూ ధ్వంసమై, యిద్దరు చైనా ప్రభుత్వ వైమానికులు మరణించిరి.

## హాంకాంగ్‌లో కమ్యూనిస్టు కార్యకలాపాలు

### తమప్రభుత్వంజాగరూకతతో వున్నదని క్రీచ్‌జోన్స్ ప్రకటన

లండన్, నవంబర్ 24: హాంకాంగులో చైనా కమ్యూనిస్టుల కార్యకలాపములను బహు జాగరూకతతో గమనించుచున్నట్లు బ్రిటిష్ వలసరాజ్య శాఖామంత్రి క్రీచ్ జోన్స్ నేడుపార్లమెంటులో ఒక ప్రశ్నకు సమాధానముగ చెప్పెను.

హాంకాంగును ఆశ్రయముగ పెట్టుకొని చైనా ప్రభుత్వమునకు ప్రతికూలముగ చర్యలు జరపదలచి అనేకమంది కమ్యూనిస్టులపై ద్వీపాంతర శిక్షలకు విచారణ జరుగుచున్నదనికూడ ఇతడనెను.

చైనానుండి ప్రజ లెవరూ హాంకాంగుకు రాకుండ అరికట్టుటకు హాంకాంగు ప్రభుత్వ మెట్టి చర్యలు గైకొనుచున్నదని కన్సర్వేటివ్ సభ్యుడు సర్ రొనాల్డ్ క్రాస్ ప్రశ్నించగా, కొంత వ్యవధి యిచ్చినచో సమాధాన మిచ్చెదనని క్రీచ్‌జోన్స్ బదులు చెప్పెను.

మలయాలోవలె హాంకాంగులో కూడ "నిద్రపోవుచూ ప్రమత్తులై వుండుటకు వీలులేదని ప్రతికూల సభ్యుడు మరొకడు హెచ్చరిక చేయగా, మలయాలో ప్రమత్తులమైవుంటిమను ఆరోపణను తానంగీకరించజాలనని మంత్రి అనెను. హాంకాంగ్ సమస్యను బ్రిటిష్ ప్రభుత్వము వేయి కళ్ళతో కనిపెట్టి వున్నదనికూడ చెప్పెను.

## భారత సేనల విజృంభణను ఆపవలసిందని భద్రతామండలికి విజ్ఞప్తి

### సర్ జఫ్రుల్లాఖాన్ లేఖపై గురువారం కాశ్మీర్ హైదరాబాద్ సమస్యలపై చర్చ జరిగేసూచన

పారిస్, నవంబరు 24: కాశ్మీరులో ఇండియాకూ, పాకిస్థానుకూ ఘోరయుద్ధము జరుగకుండా, తక్షణం ప్రయోజనకరముగనుండగల చర్యలు తీసుకొని, నివారించవలసినదని కాశ్మీరు కమీషనువారి ద్వారా పాకిస్థాను విదేశాంగమంత్రి భద్రతామండలికి అందజేసిన లేఖ నేడు ప్రచురించబడినది. (ఈ లేఖ కొంత నిన్నటి పత్రికలో ప్రకటింపబడినది.)

ఆలేఖలో జఫ్రుల్లాఖాన్ ఇట్లువ్రాసెను: "పశ్చిమ కాశ్మీరును ఆక్రమించుటకు ఇండియను సేనలు సమగ్ర సమరమారంభించినవి. ఇండియా సేనల దాడిని నిలుపు చేయనిచో పాకిస్తాను, కాశ్మీరు రక్షణకుగాను అత్యల్ప సైన్యమును వినియోగించు వైఖరిని మాని యుద్ధమునకు తలపడక తప్పదను విషయము భద్రతామండలికి గట్టిగా చెప్పక తప్పదు. లేనిచో పూంఛ్, మీర్పూరు జిల్లాలు ఇండియను సేనల వశము కాగలవు. పాకిస్తాను సేనలున్నూ, ఇండియా సేనలున్నూ తలపడినచో భయంకరమైన రక్తపాతము జరుగగలదు. ఇది జరుగకుండా ఇంతవరకు జాగ్రత్తపడియుండెను. ఈ సమస్య శాంతియుతముగ పరిష్కారము కావలెనను తలంపుతో కాశ్మీరు కమీషను వారు వెళ్లిపోయిన తరువాత శాంతి నెలకొనుటకు శాయశక్తులా పాకిస్తాను ప్రయత్నించెను. కాని ఇప్పుడు ఇండియా కాశ్మీరు సమస్యను బలముతో పరిష్కరించుటకు పూనుకొనినట్లు కనపడుచున్నది. జమ్మూ ప్రాంతములోని ఇండియా సేనలకు మూడు కాల్బలదళములు, నాలుగు సైనిక దళములు, రెండు ఫిరంగి దళములు చేర్చబడినవి. నాషేరాలో ఒక సైనిక స్థావరము ఏర్పరచి అచ్చటినుండి మూడు సైనిక దళములను, ఒక విమానా వాహిత దళమును రైసీ, పూంఛ్ జిల్లాలపై పంపకము చేయుచున్నారు. శ్రీనగరు ప్రాంతములోనికి వివిధ సైనిక శాఖలకు చెందిన దళములు క్రొత్తగా దిగినవి. కాశ్మీరులోని విమానబలముకూడా హెచ్చించబడినది. గడచిన సెప్టెంబరులో జోజిల్లా కనుమపై ఇండియను సేనలు చేసినదాడి తిరుగగొట్టబడెను. అక్టోబరులో ఝాంగరునుండి కోట్లీపై దాడి చేసిరి. అదికూడ ఝాంగరుకు 15 మైళ్ల దూరమున నిరోధించబడినది. యిప్పుడు ఇండియను సేనలు పెద్దయెత్తున యుద్ధసంరంభము చేయుచున్నవి. దీని ఆశయము మీర్పూరు, పూంఛ్ జిల్లాలతో కూడిన పశ్చిమ కాశ్మీరును జయించుటయే. ఈ రంగములో తీవ్రమైన యుద్ధము ఆరంభమైనది. ఈ ప్రాంతమునుండి అధిక సంఖ్యలో శరణార్థులు పాకిస్తానుచేరుచున్నారు. జోజిల్లా కనుమ మీదకూడా ఇండియను సేనలు దాడిసాగించి ద్రాస్‌వద్ద ఏర్పరచిన రక్షణలను ఛేదించినవి. ఈ రెండు రంగముల యుద్ధములోనూ విమానములు హెచ్చుగా ఉపయోగించ బడుచున్నవి. సత్వర విజయము సాధించి ఐక్యరాజ్యసమితి వారి ఎదుట ఒక అయిపోయిన సంఘటన ప్రదర్శించుటకు ఇండియా ప్రయత్నించుచున్నట్టు విస్పష్టమగుచున్నది. ఇంతవరకును ఆజాద్ కాశ్మీరు సైన్యములు అల్పసంఖ్యాకమైన పాకిస్తాను సైన్యముల సహాయముతో ఆత్మరక్షణకొరకు మాత్రమే ఇండియా దాడిని నిరోధించుచు వచ్చినవి. పాకిస్తాను యుద్ధవిమానములు యుద్ధము కొరకు ఇంతవరకును వినియోగించబడలేదు. ఇండియను సేనలు ఆరంభించిన ఈ యుద్ధమును నిరోధించుచో పాకిస్తాను పెద్దయెత్తున ప్రతి యుద్ధము సాగించవలసి వచ్చును. పాకిస్తాను కమీషనువారు కాశ్మీరు సమస్య పరిష్కరించుటకు శాంతియుత మార్గములు సాధించుచున్న తరుణమున ఒక పక్షమువారు తమ బలముతో కాశ్మీరు సమస్యను తేల్చివేయుట ఎంతటి ప్రమాదహేతువో గ్రహించవచ్చును. కనుక ఇది

4 వ పేజీ చూడుడు

## జపాన్ యుద్ధనేరస్థులకు ఉరిశిక్షలు

### వారంరోజులలో అమలు

టోకియో, నవంబరు 24: ఇటీవల మరణదండన విధింపబడిన ఏడుగురు జపాన్ యుద్ధాపరాధులను వారం లేక 10 రోజులలో రహస్యముగ ఉరితీయుదురని నేడు ప్రకటింపబడినది. జనరల్ మెక్ ఆర్థర్ నేడు శిక్షలను ఖాయపరచిన పిమ్మట ఈ ప్రకటన జరిగెను.

16 మంది నేరస్థులపై విధించిన యావజ్జీవ కారాగార శిక్షను, 20 సంవత్సరములు, 7 సంవత్సరములుపాటు విధించిన శిక్షలు కూడ అమలు కాగలవని జనరల్ మెక్ ఆర్థర్ ప్రకటించెను. ఏమాత్రము మనస్కరించని పని అయినను, ఈ శిక్షలను అమలు చేయక తనకు తప్పుటలేదని కూడ ఇతడనుచున్నాడు.

## ఆరబ్ రాజ్యాలతో విరోధం క్షేమం కాదని యూరప్‌కు సిరియా హెచ్చరిక

### పాలస్తీనాపై సమితి రాజకీయసంఘంలో చర్చ

పారిస్, నవంబరు 24: పాలస్తీనా అరబ్బులు ఆర్థికంగా స్వయం సమృద్ధమైన వర్గముగా ఏకీకరింపబడవలెనని, ముందు ఏ ఆరబ్ రాజ్యస్థాపనగాని, యూదురాజ్య స్థాపనగాని జరుగబోతున్నా, ఇదిమాత్రం తక్షణం జరిగి తీరవలెనని పాకిస్థాన్ ప్రతినిధి సర్ జఫ్రుల్లాఖాన్ నేడు ఐక్యరాజ్య రాజకీయ సంఘంలో ప్రతిపాదించెను.

పాలస్తీనా విభజనను ఇదివరకువలెనే తీవ్రంగా ప్రతిఘటించుచు సర్ జఫ్రుల్లా ఇలా అన్నాడు.

"పాలస్తీనాలోని 5 లక్షలమంది ఆరబ్ రక్షణార్థులను ఆర్థిక దుర్గతినుండి రక్షించవలెనంటే యూదు భూస్వాముల అధీనంలో ఉంటున్న భూములను ఆరబ్ రైతులకిప్పించుట అత్యావశ్యకము. ఈ విధంగా ప్రత్యేకవర్గములను ఏర్పరచుటవలన తక్షణ ప్రమాదం తొలగిపోగలదు."

ఇస్లాం మతసూత్రములను ముస్లిములు విస్మరించి చెడుత్రోవలలో పడుటవల్లనే వారిపై యూరపియను లెక్క స్వారీ చేయుటకు వీలు కలిగినదనీ, ఒకప్పుడు జగజ్జేగీయమానంగా వెలిగిన ముస్లింజాతి ప్రతిభ తిరిగి పూర్వదశకు ఇకముందు తప్పక రాగలదనీ కూడా సర్ జఫ్రుల్లా తన ఆశలను ఉద్ఘాటించెను.

"అరబ్బులధికంగా వున్న పాలస్తీనాలో వారి నిరంకుశత్వం క్రింద యూదు అల్పసంఖ్యాకులే మైనారిటీలో వసించడా విభజన పథకం వేయబడినది? అయితే, చెరొక్క మోటె పథకం ప్రకారం, 4 లేక 5 లక్షలమంది ఆరబ్ అల్పసంఖ్యాకులను యూదురాజ్య నిరంకుశత్వములో శాశ్వతంగా పడవేయుటకు మీరెల్లా అంగీకరించగలరు?" అని సర్ జఫ్రుల్లా అడ్డుసవాల్ చేసెను.

#### సిరియా ప్రతినిధి హెచ్చరిక

పాలస్తీనా విభజనకు పశ్చిమ రాజ్యాలు అంగీకరించినచో, ఆరబ్ రాజ్యాలలో నున్న పెట్రోలు సరఫరాలను తప్పకుండా అరికట్టివేస్తామని సిరియా ప్రతినిధి ఫారిస్ జె ఎల్ ఖౌరీ నేడు అఖరుసారి తీవ్రంగా హెచ్చరించెను.

మార్షల్ పథకపు సహాయంపైన తమ జీవితపు ఆశలన్నీ నిలుపుకున్న యూరపియన్ రాజ్యాలు, మధ్యప్రాచ్యపు పెట్రోలు సరఫరాలు లేనిదే తమ పారిశ్రామిక జీవితంగాని సాంఘికజీవితంగాని ఒక్కక్షణమైనా నిలువలేవనీ, మార్షల్ పథకం భగ్నంకాగలదని గుర్తుంచుకోవలసినదిగా సిరియా ప్రతినిధి చెవరించెను.

"ఆరబ్ దేశాలతో విరోధం తెచ్చుకొనుట మంచిదికాదు" దనికూడా ఆతడు "సామ్రాజ్యవాద దేశాలను" హెచ్చరించెను.

ఈ విషయమును ముఖ్యంగా బ్రిటన్ గుర్తుంచుకోవలెనని చెప్పుచు, అరబ్ రాజ్యాలు బ్రిటిషువారి కీలుబొమ్మలని రష్యా మున్నగురాజ్యాలు చేసేప్రచారమును ఆతడు ఖండించెను.

## బర్లిన్ ప్రతిష్టంభనపై తటస్థరాజ్యచర్చలు

### నానాటికి సమస్య అధికమౌతున్న వనిసభ్యులభావం

పారిస్, నవంబరు 24: రెండు నెలలనుండి బెర్లిన్ ప్రతిష్టంభనా పరిష్కారనిమిత్తం పాటు పడుతున్న భద్రతామండలి అధ్యక్షుడు, అర్జెంటీనా ప్రతినిధి అయిన డా॥ జువాన్ బ్రాముగ్లియా తన ప్రయత్నములను విరమించుటా లేక కొనసాగించుటా అని ప్రస్తుతం మథనపడుచున్నారు.

అతడు అగ్రరాజ్య చతుష్టయమునకిచ్చిన ప్రశ్నావళికి పశ్చిమరాజ్యములొక మాదిరిగానూ, రష్యా మరొక మాదిరిగానూ సమాధానా లిచ్చినవి. వీటిపై మండలిలోని ఆరు తటస్థరాజ్యాల ప్రతినిధులు నేడు డా॥ బ్రాముగ్లియా అధ్యక్షతన సమావేశమై చర్చలు జరుపుచున్నారు.

రెండు నెలలక్రిందట ఈ ప్రతిష్టంభనలో బెర్లిన్ కరెన్సీ సమస్యయే ముఖ్య ప్రతిబంధకంగా ఉంటూ వుండేదని, ఇప్పుడు మైరావణుడి తలలవలె అనేక నూత్న ప్రతిబంధకములు పొడ చూపినవని అమెరికన్ అధికారవర్గములు చెప్పుచున్నవి.

దిగ్బంధనను రద్దు చేసెదమని రష్యా ఇంతవరకూ సూచించనైనా లేదు. రద్దుచేస్తేగాని తిరిగి సంప్రదింపులకు దిగమని పశ్చిమ రాజ్యాలవారు తమ పూర్వపు పట్టుదలను కొంతయినా సడలించుకోనుకూడా లేదు.

## 'స్వతంత్ర' ఇండొనీషియా ఫెడరల్ సమాఖ్యస్థాపనకు సంప్రతింపులు

### రిపబ్లిక్‌తో సంప్రతింపులకై డచ్చి అమాత్యుల ఆగమనం : విదేశీ విలేఖరులపై ఆంక్ష

పారిస్, నవంబరు 24: ఇండొనీషియాలో డచ్చి అధికారులు గత సంవత్సరకాలములోనూ యుద్ధవిరమణ విషయములను ఏవిధముగా ఉల్లంఘించినదీ వివరించుచూ ఇండొనీషియా రిపబ్లికన్ ప్రభుత్వము నేడొక ప్రకటనను ఇక్కడ ఉన్న సమితి సభ్యులకు అందజేసినది. డచ్చివారితో రాయబారములు జరుపవలెననే తాము త్రికరణశుద్ధిగా వాంఛించుచున్నట్లు కూడ ఈ ప్రకటనలో రిపబ్లికనులు తెలుపుచున్నారు.

ఇప్పటికి దాదాపు సంవత్సరము క్రితము అమలులోనికి వచ్చిన యుద్ధవిరమణను డచ్చివారు ప్రధానముగ నాలుగుసార్లు ఉల్లంఘించిరట, ఇండొనీషియనులే యుద్ధవిరమణ పరిస్థితులను ఎడతెరిపిలేకుండ ఉల్లంఘించుచు, రాయబారముల పునఃప్రారంభమునకు అడ్డుపడుచున్నారని డచ్చివారు చేయుచున్న ఆరోపణలు అసత్యములని కూడ ఇందులో గలదు.

రాయబారములను తిరిగి ఏర్పాటుచేయుటకు భద్రతామండలి నియమించిన సామరస్య సంఘము చేయుచున్న కృషి జయప్రదము కావలెనని కూడ రిపబ్లికనులు ఈ ప్రకటనలో ఆశించిరి.

డచ్చివారు యుద్ధవిరమణను ఎన్నిసార్లు ఉల్లంఘించినదీ రిపబ్లికను ప్రభుత్వము స్పష్టముగ జాబితా రూపములో ఈ విధముగ స్పష్టపరచినది:

(1) పశ్చిమజావా, మధుర, తూర్పు సుమత్రాలలో ప్రత్యేక రాజ్యములను ప్రత్యేక రాజ్యములుగ చీల్చివేసిరి వివాదగ్రస్త ప్రాంతముల భవిష్యత్తును ఉభయపక్షముల రాజకీయ సంప్రతింపుల ద్వారా పరిష్కరించవలెనని యుద్ధవిరమణ నియామకములలో వున్నప్పటికి డచ్చివారు దానికి భిన్నముగ ప్రవర్తించి ఈ పని చేసిరి.

(2) తూర్పుజావాను ప్రత్యేక రాజ్యముగ మార్చివేసిరి. (3) వ్యాపార రాకపోక సౌకర్యములపై నిర్బంధములను యథాప్రకారమే వుంచిరి. దీనిఫలితముగ రిపబ్లికన్ ప్రాంతమును సూమాత్రాకొరకు సముద్ర మార్గము లన్నిటి దిగ్బంధము చేయుట జరిగినది. (4) రిపబ్లిక్ ఆంతరంగిక సైనిక, రాజకీయ పరిస్థితిపై డచ్చివారు తమ గూఢచారులద్వారా విషయములను సేకరించిని వేదికలను ప్రకటించిరి.

## బ్రిటన్‌లో నిర్బంధ సైనికసేవ

లండన్, నవంబరు 24: నేడు పార్లమెంటులో ఆమోదింపబడిన ప్రభుత్వబిల్లు ద్వారా బ్రిటనులో నిర్బంధ సైనిక సేవా కాలము 12 మాసములనుండి 18 మాసముల వరకు పెంచబడుచున్నది.

## నౌకాదళము హెచ్చింప కనడా సంకల్పము

టొరాంటొ, నవంబరు 24: నౌకాదళములో 7,500 ఆఫీసరులు, నావికులు నుండవలెనని 1948 సం॥ములో కెనడా ప్రభుత్వము నిర్ణయించియుండెను. ఈ సంఖ్యను 10 వేలవరకు హెచ్చింప కెనడా సంకల్పించుచున్నది. జలాంతర్గాములను విధ్వంసము చేయుటకై శీఘ్రగామియగు ఒక యుద్ధనావను యితర నావలకు రక్షణగా నుండుదానిని నౌకాదళమునకు చేర్చి కెనడా ప్రభుత్వమువారు సంకల్పించు చున్నారు.

## 'వీటో మహత్తరరాజకీయాయుధం'

### అల్పసంఖ్యాకుల ఆత్మరక్షణ కదొక్కటే సాధనమని సోవియట్ ప్రతినిధి ప్రకటన

పారిస్, నవంబరు 24: "వీటో అనేది మహత్తరమైన రాజకీయ ఆయుధం. ప్రస్తుతం జరుగుతున్న రాజకీయ సంఘర్షణలలో ఎంత తెలివితక్కువవాడైనా ఈ ఆయుధమును చేతులారా వదులుకోడు." అని రష్యన్ ప్రతినిధి ఆంద్రీ విషిన్‌స్కీ నేడు రాజకీయ అల్పసంఘంలో వీటో ప్రయోగాధికారమును సమర్థించుచు ఉద్ఘాటించెను.

వీటోను విసర్జించవలసినదని నీతులు చెప్పేవారిని తూర్పారపట్టుచు విషిన్‌స్కీ ఇంకా ఇల్లా అన్నాడు.

"మాపైపున వోట్లు తక్కువైనకొద్దీ మేము వీటోను మరింత ఎక్కువగా ఉపయోగించి తీరెదము. అప్పుడు సంఘర్షణలలో ఉజ్జీల బలాబలాలు సమానమగును. మాకే మెజారిటీ బలముంటే మేమూ మాట్లాడగలము వీటోనువిసర్జించవలసినదని. కాని మాకు మెజారిటీలేదు. ఇక రాబోదు.

అల్పసంఖ్యాకులకు వీటో పెద్ద రక్షణ, అండ, ఆయుధము.

వీటో విసర్జనకు ఒక్క రష్యాపైనే ఎందుకు ఒత్తిడి జరగాలి?

ఆల్బేనియా, బల్గేరియా, మంగోలియన్ రిపబ్లిక్, మొదలైన దేశాలు ఈ సమితిలో సభ్యత్వము నర్థించినప్పుడు బ్రిటన్, అమెరికాలు వీటోను ప్రయోగించినవి.

'న్యాయచట్టము, సిద్ధాంతము' అనేవి స్వార్థమునకు అనుకూలముగా తిరిగే కీలుబొమ్మలు.

మీలాగే మాకూ రాజకీయంగా స్వార్థకాంక్షలున్నవి. అయితే వచ్చిన చిక్కల్లా మీకాంక్షలకూ, మాకాంక్షలకూ తేడాలున్నవి.

మేము మైనారిటీలో ఉన్నాము. ఐక్యరాజ్యసమితిలో ఒక్క ఉన్నతపదవి అయినా స్లావ్ జాతివానికివ్వబడలేదు. కమిటీ అధ్యక్షులుగా స్లావ్‌లు నిలబడితే మీరు వీటో చేస్తారు. బ్రిటన్, అమెరికాల నాయకత్వాన మాపై బలవంతంగా మెజారిటీ అభిప్రాయం రుద్దబడుతున్నది." అని విషిన్‌స్కీ ప్రతిభావంతంగా తమ వైఖరిని సమర్థించుకున్నాడు. రాజకీయ అల్ప సంఘంలో నేడు 12 రాజ్యాల సభ్యత్వపు దరఖాస్తును రష్యా వీటో చేయడాన్ని గూర్చి చర్చలు జరిగిన సందర్భంలో విషిన్‌స్కీ పైవిధంగా వాదించెను.

# స్వతంత్రభారతదేశంలో మద్యపాననిషేధ కార్యక్రమం

## ప్రభుత్వ విధాన నిర్ణయానికి పరిషత్తు సూచనల సవరణ: గోవధపై నిషేధం

న్యూఢిల్లీ, నవంబరు 24: ఔషధములకు మినహా, మత్తుకలిగించు పానీయములను, తదితర పదార్థములను నిషేధించుటకు ప్రభుత్వము పాటుపడవలెనను సూచన నేడు రాజ్యాంగసభవారిచే ఆమోదించబడి ముసాయిదాలోని ప్రభుత్వ విధాన సూచనా సూత్రములలో చేర్చబడెను.

ఈ సవరణను ప్రతిపాదించినది మహావీరత్యాగి. 'ఔషధములకు మినహా' అని చేర్చినది షిబన్‌లాల్ సక్సేనా. సక్సేనా మాట్లాడుచు, మద్యనిషేధముపై దేశమంతటా ఏకాభిప్రాయము కలదనియు, 1941 లో మద్యములపై పన్ను 12 న్నర కోట్లుండెననియు, అది ఇటీవల రెట్టింపునకుపైగా పెరిగెననియు, ఈ ఆదాయమును కోల్పోవుటయే కాక ప్రభుత్వమువారు మద్యనిషేధము అమలుజరుపుటకు కొన్ని కోట్లు వెచ్చించుటను చూచినచో యిది యెంత మహత్తర సంస్కారమో బోధపడగలదనియు, మద్యము ఖరీదు పన్నునకు నాలుగు రెట్లను కొన్నచో మద్యనిషేధమువలన దేశములో కుటుంబము ఒకటికి నూరు రూపాయలు మిగులుచున్నదనియు, త్వరలో ఈ నిషేధము దేశమంతటా అమలు జరుగవలెనని తాను వాంఛించుచున్నాననియు చెప్పెను. సవరణను ఖండించుచు కొల్హాపూరు వాస్తవ్యుడు ఖార్డేకర్, అమెరికను ప్రభుత్వము వారు మద్యనిషేధమును రాజ్యాంగ చట్టములో చేర్చియు అమలు జరుపలేక విరమించిరనియు, ఒక ప్రభుత్వమునకును పార్టీకిని చెందని రాజ్యాంగసభలో కాంగ్రెసు కార్యక్రమములోనిదని మద్యనిషేధమునకు ప్రాముఖ్యత ఇచ్చుట అసంగతమనియు, పార్సీలూ, క్రైస్తవులు మొదలైనవారు సమ్మతించరు కనుక మద్యనిషేధము అన్నివర్గములకు ఆమోదకరమైన వనుటకు వీలులేదనియు, మద్యనిషేధము గాంధీజీకి సమ్మతమని చెప్పువారు, అంతరంగమునకు చెందిన ప్రేమ, సహనము, సత్యాహింసలు మొదలగు గాంధీజీ సిద్ధాంతములను విస్మరించి బాహ్యరూపమైన మద్యనిషేధమునే ఆరాధించుచున్నారనియు, మద్యనిషేధమువల్ల అత్యవసరమైన విద్యావ్యాప్తికి ఆటంకము కలుగుననియు, మతఫాసిస్టు ప్రభుత్వము ఏర్పడుననియు, నిషేధముల వలనను నిర్బంధములవలనను సాంఘికముగా మానవుని పెరుగుదలకు అంతరాయము కలుగుననియు, ద్రాగువారందరు త్రాగుబోతులు కారనియు, అల్పసంఖ్యాకులను ఉద్ధరించుటకుగాను ముఖ్యమైన ఆదాయము పోగొట్టుకొనుట భావ్యము కాదనియు చెప్పెను.

దేశములోని ఆదివాసులు పూజకు మద్యము వాడుదురు గనుక, తొందరపడి మద్యనిషేధముఅమలుజరిపినచో వారికి బాధకలుగును, బెంగాలు, ఒరిస్సా, సి. పి. ఆలలోని ఆదివాసులు చలినుండి ఆత్మరక్షణ చేసికొనుటకును, అనేక వ్యాధుల నివారణకును బియ్యమునుండి తీసిన మద్యము ఉపయోగించుచున్నారు. 3 కోట్ల ఆదివాసులకు అన్యాయము జరుగకుండ గలందులకు యీ సూత్రమునకు ప్రస్తుతము వాయిదా వేయవలెనని జయపాలసింగ్ వాదించెను.

మద్యము ఆదివాసులమతములో సూచితము కాలేదనియు, నీలగిరిలో నున్న ఆదివాసులు ఆత్మరక్షణకు మద్యము ఉపయోగించరనియు, మద్యనిషేధమును అక్కడ అమలు జరిపినప్పుడు వారు రొట్టె అసమ్మతిని తెలుపకపోవుటయే కాక వారి ఆరోగ్యము చక్కబడినదనియు మద్యనిషేధ కార్యక్రమము నడిపిన మాజీ మద్రాసు మంత్రి మునిస్వామిపిళ్లె చెప్పెను.

బొంబాయి ప్రధాని, బి. జి. ఖేర్ మద్యనిషేధమును సమర్థించుచు ఇట్లు చెప్పెను. రాష్ట్ర ప్రభుత్వములు దేశాభ్యుదయము కాంక్షించినవారు యెంతో దీర్ఘచర్చలు జరిపి దేశప్రజలను మత్తు పానీయములనుండియు మత్తుమందుల నుండియు రక్షించవలెనని నిశ్చయించిరి. మానవులు మానసిక, ఆర్థిక విశ్వాసములతోబాటు నైతిక వికాసము కూడా సాధించుట అత్యవసరము. కనుక మద్యపాన నిషేధావశ్యకతను గురించి పునశ్చర్య అనవసరము.

ఆత్మవినాశనమునకున్న స్వాతంత్ర్యముండవలెననుటలో అర్థము లేదు. జీవితము పెరుగవలెను. మద్యసుంకము ద్వారా ప్రభుత్వం సంపాదించిన ప్రతిరూపాయకున్నూ ప్రజలు వ్యాధులు, బలహీనత, దుర్వ్యసనము ద్వారా మూడు రెట్లు కోల్పోయిరి. ఆరోగ్యమునకు హానికరములైన పానీయములు మాత్రమే నిషేధించబడినవి. "నీరా" (తీపికల్లు) ఆరోగ్యప్రదమైనది. అది నిషేధించబడలేదు. బొంబాయిలోని అనుభవమును బట్టి, మద్యనిషేధము వచ్చిన తరువాత అక్కడి త్రాగుబోతులు బాగుపడిరి. త్రాగుడు వ్యసనమనుభోగము ఈ దేశములో అందరికిని లేదు. దేశము ఆరోగ్యవంతముగా నుండవలెనన్న వ్యసనములన్నిటిని నిషేధించుట ప్రభుత్వ కర్తవ్యము.

తాను అనేక సంవత్సరములుగా గుజరాతు, మహారాష్ట్ర, పశ్చిమ ఖాందేశ్, సి. పి. లో గల ఆదిమజాతులతో కలిసి పనిచేసితిననియు, వారు మద్యము కోరరనియు, ఒక ప్రాంతమున భిల్లులు తమకు తామే మద్యనిషేధము అమలు జరుపుకొనుటతో అక్కడ ప్రభుత్వ మేర్పరచిన కల్లు అంగళ్లు మూయవలసి వచ్చినదనియు, పూజలు మొదలగువానికి మద్యము ఉపయోగించుట వారి ఆచారము కానేకాదనియు ఏ. వి. ఠక్కర్ చెప్పెను.

పుగాకును కూడా నిషేధించవలసినదని భూపేంద్రసింగు ఒక సవరణ ప్రతిపాదించెను.

ఆదివాసులలో విద్యాధికులు మద్యనిషేధము కోరుచున్నారని లక్ష్మీనారాయణ సాహూ చెప్పెను.

చర్చను ముగించుచు డా. అంబేద్కరు ఇట్లు చెప్పెను. ఈ సవరణ ప్రభుత్వమునకు ఒక సూచనగానుండు సూత్రముమాత్రమే. దీనిని ప్రభుత్వము అమలు జరుపవలెనను నిర్బంధము లేదు. దీనిని అమలు జరుపవలెనా, ఎప్పుడు జరుపవలెను అనువది ప్రభుత్వమున్నూ, ప్రజాభిప్రాయమున్నూ కలిసి నిర్ణయించగలవు. దీనిపై చర్చ వాయిదా వేయవలెనని జయపాలసింగు కోరుట అతి విచిత్రము. ముసాయిదాలో ఆదిమవాసులకు సంబంధించిన ఘట్టము చూచినచో వారి హక్కులు చక్కగా కాపాడబడినవనియు, రాష్ట్ర కేంద్ర సంస్థాన ప్రభుత్వములు చేయు శాసనములు వారికి వెంటనే వర్తింపజేయబడవనియు తెలియగలదు.

త్యాగిగారి సవరణ షిబన్‌లాల్ సక్సేనా గారి సవరణతో సహా సభవారిచే ఆమోదించబడెను.

### గోవధపై నిషేధము

"వ్యవసాయ పశుపోషణలను ఆధునిక, శాస్త్రీయ పద్ధతులపై అమర్చుటకును, మంచిజాతి పశువులను అభివృద్ధి చేయుటకును ఆవులు మొదలైన ఉపయోగకరములైన పశుజాతుల వధను నిషేధించుటకును ప్రభుత్వము పాటుపడవలెను." అని పండిత ఠాకూర్ దాస్ భార్గవగారు తెచ్చిన ప్రతిపాదన సభవారిచే ఆమోదించబడెను.

తన ప్రతిపాదనను సమర్థించుచు భార్గవ ఇట్లు చెప్పెను. దేశములోని పశుసంపదను పెంపొందించనిచో ప్రజారోగ్యముకొరకుగాను ఇంతకుపూర్వము ఆమోదించబడిన మద్యనిషేధ ప్రతిపాదనవల్ల ప్రయోజనముండదు. ప్రస్తుతము ఇండియా 20 లక్షల టన్నుల ఆహారము దిగుమతిచేసికొనుచున్నది. కాని శాస్త్ర పద్ధతులపై పశువుల ఉత్పత్తిసాగి గోవధ ఆగిపోయినచో ఈ దిగుమతుల అవసరముండదు. గడచిన కొద్ది ఏండ్ల కాలములో ఇండియాలోని పశువుల సంఖ్య క్షీణించినది. వ్యవసాయముపై అధికముగా ఆధారపడు మనదేశములో ఇందువల్ల ఆర్థిక సంక్షోభము కలుగకతప్పదు. మహాత్మాగాంధీ స్వాతంత్ర్యముకంటె గోవధ నివారణ అతి ముఖ్యమని భావించియుండిన విషయము సభవారికి తెలిసియుండును.

"గోవధ పూర్తిగా నిషేధించబడవలెను. గోవు అనుమాట ఆబోతులకును, ఎద్దులకును, ఆవుదూడలకును కూడా వర్తించవలెను," అని భార్గవగారి ప్రతిపాదనకు సేట్ గోవిందదాసు ఒక సవరణ చేర్చెను. ఇండియాలోని సాంఘిక జీవితములోనూ నాగరికతలోనూ గోవుకు అనాదిగాఉన్నత స్థానముంటూ వచ్చుచున్నదనియు, పశువులు రక్షింపబడుచున్న అధికారాలో కృతి సమకూరదనియు, దేశములోని బంజరుభూములన్నియు సాగులోనికివచ్చి ఆహారోత్పత్తి పెరగవలెనన్న కనీసము 150 లక్షల ఎద్దులు అదనముగా కావలెననియు, గోరక్షణ కొరకు ప్రత్యేకపన్ను ఇచ్చుటకు ప్రజలు సమ్మతించవచ్చుననియు సేట్ గోవిందదాసు చెప్పెను.

దేశముయొక్క ఆదాయములో సగానికిపైగా పశుసంపదపైననే ఆధారపడి యున్నది; దేశములో తినగనన్ని పశువులు లేవు; నూరు ఎకరములకు 16 పశువులు మాత్రమే ఉన్నవి; ఇది ఎంతమాత్రము చాలదు అని చెప్పి షిబన్‌లాల్ సక్సేనా ఠాకూర్ దాస్ ప్రతిపాదనను సమర్థించెను.

ఒక్క ఆర్థికదృష్టితోనే గాక, సంస్కారరీత్యా కూడా అహింసపై ఆధారపడిన భావనీయులు గోవధ సహించరనియు, కనుక అది వెంటనే నిషేధము కావలెనని యు డా॥ రఘువీర చెప్పెను. దురేకర్ కూడా ప్రతిపాదనను సమర్థించెను.



తాను ఈ తీర్మానముపై తటస్థముగా నుండుననియు, అయినను గోవధను గురించి విస్పష్టమైన ప్రకటన జరుగవలెనని తాను దేశములోని ఇతర ముస్లిములను కోరుచున్నాననియు జడ్. ఎచ్. లారీ చెప్పెను. ఇండియాలో గోవధ జరుగరాదని నిషేధించబడనున్నచో ఆ విషయము నిష్పష్టము చేయవలెను కాని ఈ తీర్మానములో నున్నట్లు అస్పష్టముగా నుండరాదు. బక్రీదు పండుగలో అహింసకు భంగము కలుగకుండ గోవధ చేయవచ్చునని ముస్లిములు భావించుచుండిరి. కాని గడచిన బక్రీదులో గోవధ జరుగకుండ అనేక ఏర్పాట్లు చేయబడినవి. కనుక అల్పసంఖ్యాకులైన ముస్లిములకు స్పష్టముగా తెలియునట్లు అధిక సంఖ్యాకులు (హిందువులు) ఒక నిర్ధారణకు వచ్చుట ధర్మము. దీనిని సూచనా సూత్రములలో చేర్చుటకన్న ప్రాథమిక హక్కులలో చేర్చియున్న స్పష్టముగా నుండెడిది. తమ హక్కులమాట ఏమైనను, హిందువులు గోవధ నిషేధించినచో, ముస్లిములు అభ్యంతరము చెప్పబోరు. వ్యవసాయము ఆధునిక పద్ధతులపైన యంత్ర సహాయములో జరుగవలెనని కొందరు సభ్యులు చెప్పియున్నారు. వారే వ్యవసాయాభివృద్ధికొరకు గోరక్షణ కోరుచున్నారు. ఇదే అసంగతము. ఈ తీర్మానమును ఇప్పుడు వాయిదావేసి తిరిగి విస్పష్టముగా వ్రాయుట మంచిదని లారీ చెప్పెను.

గోవధ విషయమై రెండు దృష్టిపథములు ఉన్నవనియు, గోవును దేవతవలె పూజించు హిందువులు గోవధను శాశ్వతముగా నిషేధించుటలో ఆశ్చర్యము లేదనియు, ఆర్థిక దృష్టితో చూచినచో లాభకరము కాని గోవులు లక్షలకు లక్షలు ఉన్నవనియు, వీనిని వదలించుకొని మంచిజాతులను తెచ్చుకొనుట అవసరమనియు, గోవధకు కేవలమూ ముస్లిములే కారకులు కారనియు, అనేక లక్షలమంది ముస్లిములు గోమాంసము ముట్టరనియు, హిందువులే ముస్లిములకు గోవులను వధించుట కమ్ముచున్నారనియు, పాకిస్తాను విభజనానంతరము ఇండియాలో నూటికి పదిమంది మాత్రమే ముస్లిములున్నారనియు, వారుకూడా పాలము చేసుకొను పేదలగుటచే, దున్నుటకు పశువులపైననే ఆధారపడి యున్నారనియు సర్ మహమ్మద్ సాదుల్లా చెప్పెను.

డా॥ అంబేద్కరు పండిత ఠాకూర్దాస్ భార్గవ ప్రతిపాదనను స్వీకరించెను. సేట్ గోవిందదాసు సవరణ తోసివేయబడి భార్గవ ప్రతిపాదన సభవారిచే ఆమోదించబడెను.

జాతీయ ప్రాముఖ్యముగల స్థలములు మొదలగునవి రక్షించి పోషించబడవలెనను ఒక సూత్రమును, డా॥ అంబేద్కరుచేసిన చిన్న సవరణతో, సభవారామోదించిరి.

### శాసక, న్యాయిక శాఖల విభజన

పరిపాలనలోని శాసక, న్యాయిక శాఖలను, ఈ రాజ్యాంగము అమలులోనికి వచ్చిన మూడుసంవత్సరముల కాలములో పూర్తిగా విభజించుటకు ప్రభుత్వము తగు చర్యలుతీసికొనవలెనని న్యాయమంత్రి ఒక సూత్రము ప్రతిపాదించెను.

దీనిపై డాక్టరు అంబేద్కర్ ఇట్లు వివరణ చేసెను: శాసక శాఖ (ఎగ్జిక్యూటివ్)ను న్యాయిక శాఖ (జుడీషియరీ) నుంచి వేరు చేయవలెనను అభిప్రాయము చాలకాలముగా నుండి, కాంగ్రెసు ఏర్పడిన తరువాత ప్రబలమైనది. కాంగ్రెసు కోరికను బ్రిటిషు పరిపాలకులు అమలు జరుపలేదు. ఈ పని కొనసాగుటకు ఇప్పుడవకాశము చిక్కినది. కాని ఇందులో కొన్ని చిక్కులు లేకపోలేదు. కనుక ఇప్పుడు ప్రతిపాదించిన సవరణలో రెండు విషయములు గుర్తించబడెను. ఒకటి, ఇది ప్రాథమిక సూత్రముగా చేయబడలేదు. అట్లు చేసినచో ఈ రాజ్యాంగము అమలు జరుగగానే రెండు శాఖలను వేరుచేయుట ప్రభుత్వమునకు తప్పనిసరి అయియుండెడిది. రెండు, అనవసర కాలయాపన లేకుండునట్లు, ఈ విభజన సాధించుటకు మూడు సంవత్సరముల కాల మీయబడినది.

ఇది కేవలమూ సూచనయే అయినచో మూడు సంవత్సరముల పరిమితి ఏర్పరుచుట వలన ప్రయోజన మేమనియు, మూడు సంవత్సరములలోపుగా ఈ విభజన చేసితీరవలెనని రాష్ట్ర ప్రభుత్వములను నిర్బంధించుటకు అగత్యము లేదనియు, ఈ పని సాగించుట వారికి సాధ్యము కాకపోయినను తప్పనిసరి కాకపోయినను ఇది కేవలము గొంతెమ్మకోరికగా మాత్రమే ఉండిపోవుననియు, ఈ రాజ్యాంగమును నిర్మించువారు న్యాయిక శాఖకు అధికారాధికారముల నిచ్చు విషయములో జాగరూకులై ఉండవలెననియు, ఆ శాఖకు అసలే అర్హులైనవారు వచ్చుటలేదనియు, అమెరికాలో పాలకులకును న్యాయశాఖకును సంఘర్షణ జరుగుచున్నదనియు టి. టి. కృష్ణమాచారి హెచ్చరించెను.

కృష్ణమాచారితో ఏకీభవించుచు, బి. దాస్, జయపూరు కాంగ్రెసులో ఈ సమస్య చర్చించబడువరకును ఈ సూత్రమును వాయిదా వేయవలెననియు, ఈ రెండుశాఖల విభజనను కాంగ్రెసు కోరినప్పటి పరిస్థితులు మారిపోయినవనియు, పదిసంవత్సరములకైనను ఈ విభజన కొనసాగునది కాదనియు చెప్పెను.

చర్చ పూర్తికాకుండానే సభ రేపటికి వాయిదాపడెను.

# బస్సు చార్జీల హెచ్చింపు

## కౌన్సిల్ సభ్యుల విమర్శ

### ప్రభుత్వ విధానమును సమర్థిస్తూ శ్రీ గోపాలరెడ్డి జవాబు

చెన్నపట్నం, నవంబరు 25: నగరములో ఇటీవలజరిగిన బస్సు ఛార్జీల హెచ్చింపును చర్చించుటకు కౌన్సిలులో నిన్న సాయంత్రం అబ్దుల్ లతీఫ్ ఫరూకీగారు ప్రతిపాదించిన విరామ తీర్మానము సందర్భములో ఓటింగు లేకుండా, తుదవ కుప్రసంగాలు సాగినవి.

సభ్యులు ప్రభుత్వంవారి చర్యను తీవ్రముగా విమర్శించుచూ రేట్లు క్రమపరచే పద్ధతి వక్రగతిని జరిగియున్నదని ఖండించిరి. బస్సులలో విశేషంగా ప్రయాణం చేసే మధ్యతరగతి బీద తరగతి ఉద్యోగులకు ఈ హెచ్చింపు దుర్భరమైయున్నది. బస్సులను ప్రభుత్వం జాతీయ మొనర్చినట్లయితే చార్జీలు తగ్గడమే కాకుండా ఎక్కువ వసతులుకూడా చేకూరునని ఆశించిన ప్రజలకు యీ రేట్ల హెచ్చింపువల్ల ఆశాభంగము కలిగినదని సభ్యులు విమర్శించిరి.

ట్రాన్సుపోర్టు మంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు విమర్శలకు ప్రత్యుత్తర మొసగుచూ ప్రభుత్వ ఉత్తరవు అనుసరించి జిల్లాప్రాంతాలలో యిదివరకే యున్నటువంటి రేట్లనే నగరములోకూడా యిప్పుడు వర్తింప చేయబడెననియూ అట్టి చర్యను ప్రజలు ఆక్షేపించుట ఎట్టి న్యాయమనిరి. ఈ హెచ్చింపు చిన్నపన్నుయనియే తాను ఒప్పుకొన్ననూ దానివల్ల ప్రభుత్వానికిసాలుకు రు. 360000మాత్రమే ఆదాయం లభించునుగాని ఏ ఒక్కరుకూడా వ్యక్తిగతముగా ఎక్కువ భరించవలసి యుండదనిరి. ప్రభుత్వ బస్సుసర్వీసు లాభసాటిగా నున్నదా లేదా యనే విషయం రాబోవు జనవరి 26 వ తేదీని వెలువరచే బడ్జెటు చాటగలదనిరి.

ప్రభుత్వ బస్సులలో జనసమర్దము విశేషముగా ఉంటూ ఉన్నదనే విమర్శకు ప్రత్యుత్తర మొసగుచూ ప్రభుత్వానికి మొత్తంమీద 310 బస్సులు కలవని వాటిలో సామాన్యముగా 288 బస్సులు ప్రతిరోజు నడుస్తూయున్నవని మంత్రి గోపాలరెడ్డిగారు పలికిరి.

పరిపాలనా అవసరము యితర వసతుల బట్టి బస్సుమార్గాల స్టేజీలలో కొన్ని ఒక మైలుకంటె యెక్కువగను కొన్ని తక్కువగను నిర్ణయించవలసి వచ్చెననియు ఎక్కడైనా అనుకూలము ఉన్నట్లయితే నిర్మాణాత్మకమగు సూచనలు చేయవచ్చునని శ్రీ గోపాలరెడ్డిగారు కోరిరి.

#### బీదలకు గొప్ప దెబ్బ

అబ్దుల్ లతీఫ్ ఫరూకీగారు విరామ తీర్మానము ప్రతిపాదిస్తూ బస్సురేట్ల హెచ్చింపువల్ల బీదలకు గొప్పదెబ్బ తగిలినదనిరి. ఈ కొత్తరేట్లను ప్రజలందరు ఏకకంఠముతో ఖండించుచుండుట ప్రతిరోజు బస్సులలో ప్రయాణంచేస్తే వినవచ్చుననిరి. ప్రత్రికలలోను బహిరంగ సభలందును ఈ హెచ్చింపునకు ప్రతికూలత తెలియచేస్తున్నారు. ప్రభుత్వము బస్సులు జాతీయ మొనర్చబూనినపుడు ప్రయాణికులు తమకు ఎక్కువ సౌకర్యములేగాక చౌక ప్రయాణపు వసతులుకూడా కలుగునని ఆశించిరి. కాని అకారణముగా యిపుడు హెచ్చింపు జరిగియుండబట్టి మధ్యతరగతి బీదతరగతి వారికి భారమెక్కువగుచున్నది. కొద్దిజీతాలవారు యీ అదనపు చార్జీలు భరించగల స్థితిలో లేరు. ఈ విషయమును ప్రభుత్వమేమాత్రము గమనించకపోవుట శోచనీయము. నగరములో గల 32 మార్గాలలో దాదాపు 21 మార్గములందు అణానుండి అణన్నరవరకు ఛార్జీలు పెంచబడియున్నవి. ఇప్పటికే తమ సంసారములను గడుపుకొనుటకు అవస్థపడుచున్న సామాన్యకుటుంబాలవారికి యీ హెచ్చింపు మరింత భారము కలుగజేయుచున్నది. ఇట్టి హెచ్చింపు అమలుపరుచుటకు సహ్యమగు కారణము లేని కన్పించవు. ట్రాన్సుపోర్టు సర్వీసువల్ల లాభమే చేకూరుచున్నదని మంత్రిగారు యిదివరకే చెప్పియున్నందున చార్జీలు యిపుడు పెంచవలసిన అవసరమేమి కలిగెనో తోచకున్నదనిరి. బస్సు సర్వీసు ప్రైవేటు యజమానులవశంలో నున్నప్పుడే బాగుండెననియు ప్రభుత్వ సర్వీసులో కండక్టరులు, యితరులు బాధ్యత కలిగి ప్రవర్తించుటలేదనియు బస్సులలో జన సమర్దము తగ్గించుటగాని, యితర సౌకర్యములు కలుగజేయుటగాని యేమాత్రం యింతవరకు జరుగలేదనియు ఫరూకీగారు విమర్శించిరి.

ప్రతిపక్ష నాయకుడు డా॥ జాన్‌గారు ప్రసంగించుచూ రేట్లు క్రమ పరచుటకు యీ విధముగా చార్జీలు పెంచుట జరిగినదని అధికారులు చెప్పుచున్నారుగాని నిజముగా చూస్తే యీ పద్ధతి తప్పుత్రోవ పట్టినదని గోచరించగలదనిరి. దానివల్ల జనసామాన్యానికి యీకష్టపు రోజులలో మరింత కష్టము కలుగజేయుటయే యగుచున్నదనిరి. ప్రభుత్వానికి బస్సు సర్వీసు మూలమున మంచి ఆదాయము వచ్చుచుండగా యీ హెచ్చింపును యేల తలపెట్టవలసి వచ్చెనని ప్రశ్నించిరి. ఇట్టి పరిశ్రమలను ప్రైవేటు వ్యక్తులే లాభము పొందవలెనను దృష్టితో శ్రద్ధ కలిగి నిర్వహింపగలుగుదురుగాని అట్టిది ప్రభుత్వాధికారులకు సాధ్యంకాని పని యని తానిదివరకే ప్రభుత్వమునకు హెచ్చరించియుండినట్లును బస్సు సర్వీసులను జాతీయ మొనర్చే విధానమును ప్రభుత్వము యిప్పుడైనా వదిలివేయుట మంచిదనియు నుడివిరి.

శ్రీ యస్. బి. ఆదిత్యన్, కే. టి. అహ్మద్ ఇబ్రాహీము, శ్రీ భీమరావు, ఆర్. సూర్యనారాయణరావుగార్లు బస్సు రేట్లను ప్రభుత్వము యిపుడు పెంచుటకు అవసరమేమి కలిగెనో తమకు తెలియలేదనియు, యీ పెంపకంవల్ల సామాన్య జనులకు గొప్ప దెబ్బ తగులుచున్నదనియు, ప్రభుత్వంవారు ప్రజల అభిమతమును పాటించి యథాపూర్వకమైన చార్జీలను తిరిగి ప్రవేశపెట్టవలెనని కోరిరి.

#### మంత్రి జవాబు

ట్రాన్సుపోర్టుమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు విమర్శలకు జవాబు చెప్పుచూ ఇట్లనిరి. రాజకీయ పక్షపాతముల దృష్ట్యా సభ్యులు ప్రభుత్వము యీ బస్సురేట్ల హెచ్చింపును ఖండించియున్నారుగాని పత్రికలలో కొద్ది ప్రచారమతప్ప యీ హెచ్చింపు విషయమై విశేషముగా ప్రతికూలాభిప్రాయము ఉన్నట్లు గోచరించలేదనిరి. జిల్లా ప్రాంతాలలో ప్రభుత్వపు ఉత్తరవు అనుసరించి ఇదివరకే మైలుకు ఒకణా తరువాత మైళ్లకు అర్ధణాచొప్పున రేట్లు అమలులోనుంటూ ఉండగా మదరాసు నగరంలో అట్టిపద్ధతి అమలుచేసినప్పుడు ప్రజలెందుకు ఆక్షేపించవలెననిరి. ఒక ప్రదేశానికి యింకో ప్రదేశానికి తారతమ్యము లేకుండా చేయుటకే న్యాయమున యీ విధానము అమలుపరచడమైనది.

నగరములో యిదివరకు ఎక్కువ దూరము వెళ్లేవారు తక్కువచార్జీయును తక్కువ దూరము ప్రయాణికు లెక్కువచార్జీయిచ్చుటయు జరుగుచుండెననియు, అట్టి వ్యత్యాసములేక సమముగా అన్ని ప్రాంతాలకు ఒకేవిధమైనరేట్లు నిర్ణయించుటకే యీ ప్రయత్నము జరిగినదనియు యిదివరకు తక్కువ చార్జీతో యెక్కువ ప్రయాణం చేసినవారు యికమీదట ప్రయోజనం లేదనియు చెప్పిరి. అదియునుగాక నగరములో 32 మార్గాలలో 21 మార్గములందు మాత్రమే యీ హెచ్చింపు ఏర్పడి యున్నదనియు, హెచ్చింపులేక, కొన్ని స్థలాలలో చార్జీలు కూడా తగ్గింపబడిన ప్రాంతాలలోని ప్రయాణికులు యీ విధానమును హర్షించుచున్నారనిరి. ఈ హెచ్చింపు పన్నుయని తాను ఒప్పుకొన్ననూ దానివల్ల సాలుకు రూ. 360000 ప్రభుత్వానికి రాబడి వస్తున్నదనియు, ప్రజలకు వ్యక్తిగతముగా ఆ భారము అతి స్వల్పమేయనియు పలికిరి. జనసమ్మర్దముతగ్గించుటకు ప్రభుత్వము నగరములో 310 బస్సులు ఉంచి, ప్రయాణీకుల వసతులకు తగినవిధమున బస్సులను అనేక మార్గాలలో నడుపుటకు ఏర్పాట్లు చేసియున్నదనియు ఈ స్వల్ప హెచ్చింపును ఆక్షేపింపకూడదనియు నుడివిరి.

అప్పటికి సాయం 6 గంటలు కాగా చర్చ ముగించబడెను. కౌన్సిలుసభ మరుసటిరోజుకు వాయిదాపడెను.

# జమీందారీ రద్దు బిల్లుకు కౌన్సిల్ ఆమోదం

### చర్చలో పాల్గొనుటకు ప్రతికూలపక్ష నిరాకరణ

చెన్నపట్నం, నవంబరు 25: మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ నేడుదయం జమీందారీ రద్దు శాసనమును ఆమోదించినది. ప్రతికూలపక్ష సభ్యుల సూచనలలో న్యాయమైనవానినికూడా ప్రభుత్వం నిరాకరించుచున్నందునన్నూ, ప్రభుత్వం ప్రతికూలపక్షముపట్ల తగు ఆదరము చూపుట లేనందుకల్లనూ, ప్రతికూలపక్షం చర్చలో పాల్గొనరాదని ఆ పక్ష నాయకుని తరఫున అబ్దుల్ లతీఫ్ ఫరూకీగారు చెప్పిరి. నేడు సభకు డా॥ జాన్‌గారు, సర్ ఏ. లక్ష్మణస్వామి మొదలియార్‌గారు, మరికొందరు ముఖ్య ప్రతికూలపక్షసభ్యులు రాలేదు. మిగతా శాసనములపైకూడా నేడు కౌన్సిల్ చర్చ జరుగలేదు.

శ్రీ పసుమర్తి వీరభద్రస్వామిగారు ఈ శాసనమును ప్రజానీకం ఆమోదించుచున్నదనీ, కాంగ్రెస్ పక్షం ప్రజల హితమును కోరుపక్షమని ఋజువైనదనీ చెప్పిరి.

శ్రీ ఆదిత్యన్‌గారు శాసనోద్దేశములు విశ్రమైనవని. దీనివల్ల కాంగ్రెస్ పంక్తి ప్రజలలో వృద్ధిచెందినదని. కాని శాసన వివరములు కొన్ని, న్యాయశాస్త్ర విరుద్ధముగా నున్న వేమోనని వారు సందేహము వెలిబుచ్చిరి. రైత్వారీ శిస్తు సంస్కరణలను త్వరలో తెచ్చి రివిన్యూమంత్రిగారు కర్షకుల నుద్ధరించవలసియున్నదని చెప్పిరి.

శ్రీ రామనాథన్ చెట్టిగారు తమిళములో ఉపన్యసించుచూ శాసనమును, రెవిన్యూ మంత్రిగారినీ ప్రశంసించిరి.

రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు శాసనమును సభ ఆమోదించుచున్నందుకు సభ్యులకు కృతజ్ఞత వెలిబుచ్చిరి. ప్రతికూలపక్షం చర్చలో పాల్గొనకపోవుటకు రాజకీయ హేతువులుండి యుండవలెనని మంత్రిగారనిరి. కౌన్సిల్‌లో సవరణల నంగీకరించకపోవుట ఇప్పుడు క్రొత్తగాదనిరి. జాయింటు సెలక్టుకమిటీలో పాల్గొన్న కౌన్సిల్ సభ్యులు చేయదగినంతే సెలక్టు కమిటీలోనే చేయగలిగిన అవకాశముండగా, ఇచ్చట ఈ సభలో ఒక్క సవరణను అంగీకరించలేదని నిందించుట ఉచితముగాదనిరి. ప్రతికూలపక్షం చర్చలో పాల్గొననందుకు మంత్రిగారు చింత వెలిబుచ్చిరి.

లోకంలో విలువలను పాటించకుండా, ధర్మాన్ని, న్యాయాన్ని త్రోసిపుచ్చి ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించుచున్నట్లు ఎవరూ సందేహించ నవసరంలేదనిరి. శాసనాలను గతానికికూడా వర్తింపచేయుటలో కూడా అనుచితమేమీ లేదనిరి. ఇట్లు వర్తింపచేయుబడిన శాసనము లనేకమున్నవి. ఇట్టి శాసనము వచ్చునని గ్రహించి కొందరు తత్ఫలితముల నుండి తప్పించుకొనుటకు యత్నించినందు వలన, వారికి అనువర్తింపచేయక తప్పదు. ఇందులో అన్యాయమేమీ లేదు. శాసనమును అమలు జరుపుటలో ప్రభుత్వం అత్యంత జాగ్రత్త వహించగలదు. కర్షకుల కుపకారము కలుగచేయవలెనని ప్రభుత్వం యత్నించుచున్నది. అందువల్లనే సాధ్యమైనంతత్వరలో రైత్వారీ శిస్తువిధాన సంస్కరణలను ప్రవేశపెట్టగలరని మంత్రిగారు చెప్పిరి.

ప్రతికూల పక్షమును తాము తృప్తిపరచజాలకపోవుట సహజమేనని మంత్రిగారు చెప్పిరి. లోకంలో అందరినీ ఒకేసారి తృప్తిపరచుట అసాధ్యం. కాని రాజకీయ వాదులు కాలానుగుణమైన విలువలను న్యాయధర్మాలను పాటించి శాసనములు చేయగలరనిరి. గాంధీజీ ఆదర్శములను పాటించి, వాని నాచరణలో పెట్టి ప్రజానీకానికి వీలైనంత ఉపకారం కలుగచేయుటకు యత్నించగలరని శ్రీ వెంకట్రావుగారు చెప్పిరి.

12-10 గంటలకు శాసనమును కౌన్సిల్ ఆమోదించినది.

## బుధవారం చర్చ

మదరాసు, నవంబరు 25: మదరాసు కౌన్సిలులో నిన్న మధ్యాహ్నము మొత్తం 69 సవరణలలో 56 సవరణలు ముగిసినానక, చట్టం ప్రకారం చేసే నిబంధనలు అసెంబ్లీ మాత్రమేగాక కౌన్సిలు ఆమోదమును కూడ బడయవలెనను సవరణ డా॥ జానుగారు ప్రతిపాదించి, దానిపై ఓట్లు లెక్కించవలెనని పట్టుపట్టినాక, 9-20 ఓట్లతో సవరణలు ఓడిపోయినందున, యింక యీ సభలో సవరణలు ప్రతిపాదించి లాభంలేదని చర్చలో పాల్గొనమని డా॥ జానుగారు ప్రకటించిరి. తరువాత క్లాజులన్ని ఒక్కమారుగ అంగీకరించబడినవి.

అల్పాహారానంతరము కౌన్సిల్ తిరిగి సమావేశమయినపుడు క్లాజులు 26, 27, 28, 29, 30 చర్చ లేకుండగానే ఆమోదింపబడెను.

శ్రీ ఆత్మకూరి గోవిందాచారి 31 వ క్లాజుకు ఒక సవరణను ప్రతిపాదించుచూ, ఈనాందారులకు సంబంధించినంతవరకు, సాంవత్సరిక ఆదాయమును ఆధారము చేసికొని మాత్రమే పరిహారమును నిర్ణయింపవలయుననిరి. ఇనాందారుల పరిహారమును నిర్ణయించుటలో రైత్వారీ శిస్తును ఆధారము చేసికొనరాదని ఆచారిగారనిరి.

ప్రతిపాదనను శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్య బలపరచిరి.

శ్రీ వెంకటరావు, బిల్లులో సాంవత్సరిక ఆదాయమును గురించి ఇచట ప్రసక్తి రానక్కరలేదనిరి. పైగా ఈనాందారులు కూడా మేలువరందారులే. వారికి ప్రత్యేకత ఏమియులేదనిరి.

శ్రీ గోవిందాచారి సవరణ నుపసంహరించుకొనిరి. తర్వాతక్లాజులు 31,32,33, 34, 35, 36 ఆమోదింపబడెను.

శ్రీ ఆర్. సూర్యనారాయణరావు క్లాజు 37 కు ఒక సవరణ ప్రతిపాదించుచూ, 1939 పూర్వము చేతులుమారిన ఎస్టేట్లకు పరిహారమిచ్చుటలో, వాటి "ఖరీదు" ను ఇవ్వవలెననియు, సర్వే అయిన ఎస్టేట్లకు పరిహారమిచ్చుటలో సర్వే ఖర్చులనుకూడా ఎస్టేటుదారుల కివ్వవలెననియు వాదించిరి. ఎస్టేట్లను కొనినవారు, తమ ధనమును సద్వినియోగము చేసుకొనవలయుననే కొనిరి. ఇందులో అక్రమమేమియునులేదు. కాన వారికివారు ఎంతకుకొనిరో అంతధనమును ఇవ్వవలెను. పైగా కొందరు ఎస్టేటుదారులు ప్రభుత్వోద్యోగుల చేతనే భూమిని సర్వే చేయించి, సర్వేఖర్చులను ఇచ్చుకొనిరి. వారికి ఈ ధనమును పరిహారముతోపాటు ఇచ్చుట న్యాయమని సూర్యనారాయణరావుగారనిరి.

జనాబ్ ఇబ్రాహీం ప్రతిపాదనను బలపరచిరి.

డా॥ జాన్ మాట్లాడుచూ, తమకు రూ 20 లక్షలుపెట్టి ఒక ఎస్టేటును కొనిన మిత్రుడొకడు కలడనిరి. కాని అతనికినేడు రూ 5 లక్షల పరిహారము వచ్చును. ఇది అన్యాయమనిరి.

శ్రీ వెంకటరావు సమాధాన మిచ్చుచూ దేశములో పరిస్థితులు మారబోవుచున్నవని తెలిసికూడా 1944 లో కొందరు ఎస్టేట్లను కొనినమాట వాస్తవమే ననిరి. కొందరు దర్జాకొరకై ఎస్టేట్లను కొనిరి. శ్రీ అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యవంటి పెద్దమనుషులు, జమీలనుకూడా కొనుట యెందులకు? జమీలేకుండా గౌరవము లేదా? ఏమైనను, ఈ ఎస్టేట్లను కొనినవారు, దూరాలోచనతో ధనమును ఖర్చుపెట్టిరన వీలులేదు. ఈప్రతిపాదన అంగీకారయోగ్యము కావని వెంకటరావుగారనిరి.

ప్రతిపాదన వీగిపోయెను.

ఆ. గోవిందాచారిగారు, చేతులుమారిన ఇనాందారీలలోకూడ కొన్నవారు చెల్లించినంత మొత్తము నష్టపరిహారంగా యివ్వాలని వేరొక సవరణ ప్రతిపాదించిరి. వారి శిస్తులు తగ్గిందాని ప్రకారం యిచ్చినచో అట్టివారు చాల నష్టపోయెదరనిరి.

డా॥ జాను: గౌ॥ సభ్యులు తమ సవరణలు ఉపసంహరించుకొనుటకు నిశ్చయించుకొనియే ప్రతిపాదింపవచ్చునా?

అధ్యక్షులు: వారిమనసు తెలుసుకొనుటకు సాధనం చూపండి (నవ్వు).

సవరణ ఉపసంహరించుకొనబడెను. "ఇనాము" అను పదం 38 వ క్లాజులో మినహాయించవలెనని ఆర్. సూర్యనారాయణగారు ప్రతిపాదించిరి.

రివెన్యూమంత్రిగారు ప్రత్యుత్తరము చెప్పుచు, తిరుపతి దేవస్థానానికి కొందరు దాతలు యిచ్చిన ఇనాంగ్రామాలకు దేవస్థానం హుండీ రాబడినుండి ఖర్చుచేస్తున్నారు. కనుకదాన్ని ప్రభుత్వాన్ని తీసుకోమని కోరిరనియు, అందుచే వాటిని యీ చట్టంనుండి మినహాయింప నవసరం లేదనియు, చెప్పిరి. సవరణ ఒడిపోయెను. 38 వ క్లాజు అంగీకరించబడెను.

నష్టపరిహారంయొక్క మూల మొత్తం (వార్షిక రాబడి) నిర్ణయించిన పుడు, ఆ నిర్ణయంపై ట్రిబ్యునలుకి అపీలుచేయుటకు అవకాశం ఉండాలని కోరుచు 39 వ క్లాజులో 7 వ సబ్‌క్లాజు మినహాయించమని సూర్యనారాయణరావుగారు సవరణ ప్రతిపాదించిరి. నష్టపరిహారం ఎవరెవరికి పంచాలో అనువిషయమున అపీలుకి అవకాశం ఉండాలని సూచించిరి. అది అనవసరమని మంత్రిగారు చెప్పిన పిదప, 39 వ క్లాజు అంగీకరించబడెను.

ఈచట్టం ప్రకారం చేయుని బంధనలు అసెంబ్లీ ఆమోదమును బడయవలెను, అనిగల 40వ క్లాజులో "రెండుశాసనసభలఆమోదము" అని సవరణ డా॥ జానుగారు ప్రతిపాదించిరి. ఈసవరణ యీ సభా గౌరవమునకు భంగకరమనిరి. కనుక సభ్యులంతా సవరణ అంగీకరించాలనిరి.

రెవిన్యూ మంత్రిగారు బదులు చెబుతు తాము మొదట "రెండు శాసనసభల ఆమోదము"అనియే యుండెను. కాని జాయింటు సెలక్టు కమిటీవారు, తానువలదంటున్నా యిట్లు తీర్మానించిరి గనుక, నిబంధనలు గావించి అసెంబ్లీ ఆమోదించు లోపున, తాను చట్టమును సవరించుచు వేరొక బిల్లు ప్రతిపాదించెదనని వాగ్దానముచేసి, జాన్‌గారిని సవరణ ఉపసంహరించుకొనగోరిరి. ఇపుడీ సవరణ అంగీకరిస్తే తిరిగి అసెంబ్లీ సమావేశం జరపాలి, చట్టం 2, 3 నెలలు ఆలశ్యమగును, కనుక ప్రభుత్వం వారు అంగీకరించలేరు, అంతేకాని యీ సభ యెడల అగౌరవం చూపుటకాదనిరి.

డా॥ జానుగారు: అవసరమైతేఅసెంబ్లీ వారంరోజులలో సమావేశపరచాలి.అంతేకాని ఎట్టి సవరణ చేయజాలనపుడు యీ సభలో చర్చ యెందుకు, సవరణ ఉపసంహరించుకోజాలను.

అంతట అధ్యక్షులు 5 నిముసాలపాటు వ్యవధియిచ్చి సవరణలు ఓటునకు పెట్టగ అనుకూలురు 9 గురు ప్రతికూలురు 20 మంది, తటస్థులు 1 (నటరాజను) ఉండగా సవరణలు ఓడిపోయినవి. క్లాజు అంగీకరించబడెను.

డా॥ జానుగారు ప్రతికూలపక్షం తరపున యింక తాము యీచట్టంలో ఎట్టి సవరణలు ప్రతిపాదించదలచుకోలేదనియు, గత ఓటింగు ఫలితంగా పార్టీ డిసిప్లిను పేరిట పార్టీ నిరంకుశత్వం ప్రబలి, యీ సభ నిరర్థకమయిందనియు నుడివిరి.

తరువాత, మిగిలిన క్లాజులన్నీ ఎట్టి సవరణలు లేకుండ అంగీకరించబడినవి. ఆర్. సూర్యనారాయణరావుగారు కూడ తమ సవరణలు ప్రతిపాదించలేదు. ఆ. గోవిందాచారిగారు డివిజను సమయానా సభలో లేరు.

చట్టం రెండవ ప్రతిపాదన ముగిసెను. వెంటనే చట్టం శాసనంగా అంగీకరించమని రెవెన్యూమంత్రిగారు ప్రతిపాదించగానే, భీమారావుగారు మాటాడుచు, ఇనాములకు నష్టపరిహారం యిచ్చునప్పుడు, యిపుడు తుంగభద్రప్రాజక్టు భూములకు ఇస్తున్నట్లు100 × 15విలు నష్టపరిహారంయిచ్చుటేగాక, మరొక 85% వంతు "ఎక్సుగ్రాషియా కంపెంషేసను" యివ్వాలని సూచించిరి. అట్లా యిచ్చుటకు ప్రభుత్వానికి అధికారం గలదనిరి.

డా॥ ఎ. లక్ష్మణస్వామి మదల్యారు

డా॥ ఎ. లక్ష్మణస్వామి మదల్యారుగారు, రివెన్యూమంత్రిగారిని యీ చట్టానికై అభినందింప జాలననిరి. భావి చరిత్రకారులు ఏ చట్టానైనా విలువను బట్టి లెక్కజేయుదురు. దీనిలో చెప్పుకోదగ్గ విలువలేదు. పైగా దీనివల్ల కొన్ని నూతన పరిపాలనా సిద్ధాంతాలు వెలువడినవి. కాంగ్రెసు ఎన్నికల ప్రణాళికయందు సూచించెంగనక, లేదా హైకమాండు కోరిందికనుక 1939 లేక 1945 సం॥ నుండి, గడిచిపోయిన కాలానికిగూడ యీ చట్టాన్ని వర్తింపజేసి, న్యాయం నీతి అనేదిలేకుండా చేస్తున్నారు. కమ్యూనిస్టులు రేపొక ఎన్నికల ప్రణాళిక ప్రకటించి 1955 లో ప్రభుత్వాధికారానికి వస్తారనుకోండి. అపుడు తాము ముందే చెప్పేమని 1948 నుండికూడ ఒకటికిమించిన యిండ్లున్నవారందరియిండ్లు అమ్మేసి దమ్మిడి రాకుండా చేయవచ్చు. ఈ సిద్ధాంతం ప్రకారం అయితే ఆస్తుల విలువలే యూపుమాసిపోతాయి.

నష్టపరిహారం నిర్ణయించే విషయంలో న్యాయమూర్తులు గల సంస్థకు విడిచిపెట్టాలని ప్రభుత్వంవారిని మేమెంతకోరినా, రివెన్యూ బోర్డుకే ఒప్పగించిరి. రివెన్యూ బోర్డువారి యెదుట లాయరులు పార్టీల తరఫున వాదించవచ్చని రివెన్యూ మంత్రిగారు అన్నారు. అట్లయిన విచారించేవారు కూడ న్యాయమూర్తులుంటే వచ్చిన భయమేమి? రివెన్యూబోర్డు సభ్యులను తరుచు మార్చేస్తూవుంటారు. వారివల్ల న్యాయం జరుగుట కష్టము. ఇట్లాంటి ముఖ్యమయిన చట్టం అమలుజరిపే న్యాయనిర్ణయాధికారం పూర్తి ప్రభుత్వ తాబేదారులకు విడిచిపెట్టరాదు. న్యాయమూర్తులకే యుండాలి.

అని డా॥ మదల్యారు ప్రసంగించుచుండగ 4 గం. అయినందున చర్చ నిలుపబడి, మోటారు బస్సురేట్లచర్చకొనసాగెను.

## ఇండొనీసియా బాల బాలికలకు పాలసప్లయి

బటేవియా, నవంబరు 24: ఇండొనీసియా బాలబాలికల ఉపయోగార్థం అమెరికా 67 టన్నుల పాలపొడిని డిసెంబరు 15 నాటికి పంపబోవుచున్నది.

# బొంబాయిలో తుపాను బీభత్సం

## క్రమంగా సామాన్య పరిస్థితి ఏర్పడుచున్నది

బొంబాయి, నవంబరు 24: "గడచిన 36 గంటలలోనూ, బొంబాయి పౌరజీవితి మంతయూ స్తంభింపజేసి బీభత్సము సల్పిన తుపాను ఇప్పటికి, పోనికలవశే అదృశ్యమైనది. తిరిగి పరిస్థితులు యథాస్థాయికి వచ్చుచున్నవి," అని బొంబాయి మంత్రి మురార్జీ దేశాయిగారు ఒక పత్రికా విలేఖరితో అనిరి.

ఈ తుపానతో, బొంబాయిలోని విద్యుచ్ఛక్తి సరఫరాలన్నియు చికాకు చేయబడి పట్నమంతయూ అంధకారమైపోయి తిరిగి ఈ సాయంత్రమే విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడి పురవీధులన్నియూ విద్యుద్దీపముల కాంతులతో, అంధకారమునుండి ఉజ్వలముగా బయల్పడుచున్నవి. తాతా హైడ్రో ఎలెక్ట్రిక్ కంపెనీవారునూ 'రాయల్ ఇండియన్ ఎంజనీరులును కలసి తీవ్రముగా కృషిసల్పి, అయిదు ప్రధాన విద్యుచ్ఛక్తిసరఫరాలలో నొకదానిని పునరుద్ధరించి పట్నమునకు తిరిగి ఇంతత్వరలో వెలుగునిచ్చిరి.

కేవలము తుపానువల్ల విద్యుచ్ఛక్తి సరఫరాలకు ఇంత దెబ్బతగిలి యుండవలసినది కాదట. ఈ తుపానువల్ల విరుగబడిన ఒక చెట్టు స్థిమదు ఈ సరఫరాల కన్నిటికి ముఖ్యకేంద్రమైన ఒక గోపురమును కొట్టుకొని అది పడిపోవుటతో, అట్టి చికాకు కలిగినదట.

బొంబాయికినీ, భారత దేశములోని ఇతర ముఖ్యపట్టణములకునూ గల వార్తా మార్గములన్నియూ త్వర త్వరగా పునరుద్ధరింప బడుచున్నవి. ఈ ఉదయము, నండియా, ఢిల్లీ బొంబాయిలమధ్య వార్తా సౌకర్యములన్నియూ యథాతథముగా పని చేయుచున్నది. కలకత్తా వార్తా మార్గములు చాలవరకు పునరుద్ధరింపబడినవి. మద్రాసుతోగూడ సంబంధము లందు కొనబడినవి.

బొంబాయిలోనూ, సూరత్, నాసిక, పూనా జిల్లాలలోనూ, తంతి టెలిఫోను మార్గములకు చాల నష్టము కలిగినది. బొంబాయి పూనాల మధ్యనున్న టైగ్రస్ కంట్రోలు మార్గములన్నియూ విచ్ఛిన్నమగుటచే లండన్ మొదలగు విదేశములతో నున్న వైర్‌లెస్ వార్తా మార్గములన్నియు స్తంభించి పోయినవి. ఇవి యింకనూ పునరుద్ధరింపబడలేదు. విదేశ వార్తలన్నియూ ప్రస్తుతము ఢిల్లీనుండియే నిర్వహింపబడుచున్నవి.

ఈ తుపానువకు గురియై చికాకుపడిన కాందిశీకుల కంచరకూ పునరావాసములు కల్పించి, సహాయము చేయుటకు బొంబాయి ప్రభుత్వము తీవ్రమైన ప్రయత్నములు చేయుచున్నది. కాందిశీకులకొరకు నిర్మింపబడిన కుటీరములునూ, ఆవాస కేంద్రములునూ చాలవరకు ధ్వంసమై పోయి యుండుటచే ఈ కాందిశీక సమస్య తిరిగి తీవ్రరూపమును తాల్చుచున్నది. నిలువనీడలేక, లక్షమంది కాందిశీకులు బొంబాయి సముద్రపు రేవులోనికి కొట్టుకొనివచ్చి అచ్చట నిరాధారులై యున్నారు. రేవులో నున్న ఒక ప్రయాణీకులశాలను ప్రద్దలు గొట్టుకొని అందు ప్రవేశించియున్నారు. జనం వత్తిడివల్ల రేవులో నుండి ఆహార ధాన్యముల సరఫరాలన్నియూ స్తంభించిపోవుచున్నవి. ఇంకను ఇట్లే కాందిశీకులు, మరి కొన్ని మూకలు రేవులోనికి ప్రవేశించిరేని రేవులో నైశ్యమైన ఆహారధాన్యము లెత్తుటకు గల అవకాశము పూర్తిగా స్తంభించిపోగలదని అచ్చటనున్న రేవు అధికారి ఒకరు చెప్పుచున్నారు.

ఈ కాందిశీకులకు పునరావాసములు కల్పించుటకు మిలిటరీవారు 7 వందల గుడారములను ఇచ్చిరి. తుపానువల్ల కాందిశీకులలో 9 మంది కుటీరములు కూలినందువల్ల మరణించిరనీ, పదికొంతమందికి గాయములు తగిలిననీ, కాందిశీకరక్షణాధికారి మేజర్ జనరల్ ఖాన్‌స్లేగారు చెప్పుచున్నారు.

ఈ తుపానువల్ల కలిగిన మొత్తం మరణములు 16; క్షతగాత్రులు 58; 28 మంది వైద్యశాలలో చికిత్స పొందుచున్నారు. ఈ తుపానువల్ల బొంబాయి మిల్లుల వస్త్రోత్పత్తిలో కనీసం, పదికోట్ల గజముల తరుగుదల గలుగునని అంచనా వేయబడుచున్నది.

తుపాను కారణముగా బొంబాయి రేవులో నున్న 'దీపావతి', 'సతావతి' అను రెండు పొగయోడలునూ, 'లేడీ విల్సన్' అను గస్తీనౌకయూ మునిగిపోయినవని బొంబాయి ప్రభుత్వ సమాచారశాఖనుండి ఒక ప్రకటన వెలువడినది. ఇంకా ఇతర, చిన్నచిన్న నౌకలు దెబ్బతిన్నట్లు తెలుపబడుచున్నది.

శాంటాక్రజ్ విమానకేంద్రమున 'ఎయిర్ ఇండియా' విమానములన్నియూ, రేపటి ఉదయమునుండి, తమ ప్రకారము ప్రయాణ కార్యక్రమములు నిర్వహింపగలవని ప్రకటింపబడినది.

ఢిల్లీ, మద్రాసు, కలకత్తా, కరాచీ విమానమార్గములు నాలుగునూ నేడు పునరుద్ధరింపబడినవి. అహమ్మదాబాదు, బిరాపీయులకు పోవలసిన విమానము నేడు జూహూకేంద్రమున బయలుదేరినది. కలకత్తా మీదుగా విదేశములకు పోవలసిన 'స్టార్ లైన్' విమానముకూడ నేడు శాంటాక్రజ్ విమానకేంద్రమున బయలుదేరినది.

ఈ తుపానువల్ల, యేవో ఒకటి రెండు ఇల్లుకూలుటతప్ప పూనాకు పెద్దనష్టము కలుగలేదు. మంగళవారము మధ్యాహ్నం బొంబాయిలో బయలుదేరిన 'మద్రాసు ఎక్స్‌ప్రెస్' రైలు 10 గంటలు ఆలస్యముగా పూనా చేరినది.

దక్షిణ భారతమునందు ఈ మాసారంభమున గల్గిన అతివృష్టివలన పంటలకు చాల నష్టమున గల్గియున్నది. దానికితోడు ఈ తుపానుగాలితో సహా కురిసిన కుంభవృష్టి వల్ల మరింత తీవ్రమైన పరిస్థితి యేర్పడగలదని తలంపబడుచున్నది.

# "మనందరి మనస్సులను సరిదిద్దగల వ్యక్తి డాక్టర్ పట్టాభిగారు"

## జన్మదినోత్సవసభలో రంగాగారి ప్రశంస

### నగరంలో పలుచోట్ల ఉత్సవాలు: వెంకట్రావు, చంద్రమౌళి, గోపాలరెడ్డి ప్రభృతుల అభినందనలు

మదరాసు, నవంబరు 25: ఆంధ్రతమిళ కాంగ్రెసు సంఘాధ్యక్షులు, మదరాసు మంత్రులు, ప్రముఖ కాంగ్రెసువాదులు పెక్కుమంది నిన్న సాయంకాలం రాజాజీ హాలులో సమావేశమై, జయపుర కాంగ్రెసు అధ్యక్షులుగ ఎన్నుకొనబడిన డా॥ పట్టాభిగారి 69 వ జన్మదినోత్సవం జరిపి, వారి గుణగణములను కొనియాడుచు ఉపన్యసించిరి. ప్రేక్షకులతో సభామందిర మంతయూ నిండిపోయెను. ప్రథమరు రంగాగారు అధ్యక్షత వహించిరి. ముందుగ శ్రీ వేమూరి సూర్యనారాయణగారి ఏకపాత్రాభినయం జరిగెను. మధ్యలో సినీమాతార బాలసరస్వతి కొన్ని పాటలుపాడెను.

డా॥ కె. వి. స్వామిగారి యింటినుండి సుమారు 50 మంది వాలంటీరులు ఎర్ర దుస్తులు ధరించి జాతీయపతాకములతో "రాష్ట్రపతి పట్టాభికిజే" యని నినాదమొనరించుచు, సభకు ఊరేగింపుగావచ్చిరి.

ప్రథమరు రంగాగారు, యీ యేడు కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక యిదివరకువలె గాంధిమహాత్ముని ఆశీర్వచన బలంవల్ల జరుగక, పోటీతోగూడినది కాబట్టి, అందు గెలిచిన ఖ్యాతి డా॥ పట్టాభిగారికి చెందినది. ఎన్నికల అనంతరం ఓడినవారు గెలిచినవారు అన్యోన్య సామరస్య సహకారములతో నుండుట పాశ్చాత్య దేశాలలో ఆచారం. ఆ సాంప్రదాయం ప్రకారం టాండన్జీ రాజ్యాంగ పరిషత్తు సభలో డా॥ పట్టాభిని కలసి గౌరవించి అభినందించి వినయాతి వినయుడై ప్రవర్తించుట చూస్తే గాంధితత్వం విజయమొందిం దనిపించును. ఇరవై సంవత్సరాల క్రితమే గాంధీజీ దక్షిణాదిని యిరువురు మేధావు లున్నారని వారిద్దరిని ఎంచియుంచెను. వారు పట్టాభి, రాజాజీ. పట్టాభిగారు యీ నాడు రాష్ట్రపతిగా గాంధి మహాత్ముని సహాయబలమును పొందలేరు. ఈ నాడా బలం మనం, ప్రజలం వారికి యివ్వాలి. పటేలు, నెహ్రూ, రాజేంద్రప్రసాదులు యితర పనులలో నిమగ్నులయి యుందురు. కావున, గాంధిగారిస్థానే దేశాన్ని కాంగ్రెసును నడిపించగల పెద్ద డా॥ పట్టాభిగారే.

కాంగ్రెసు బస్తీలకు ధనికులకు లోబడరాదని మా బోటి వారు, కార్మికులకు రైతులకు లోబడరాదని యితరులు, ధాన్యంధర తగ్గించరాదు, ఇంప్లేషను వచ్చిందని కొందరు, తగ్గించి రైతునోట మట్టికొట్టరాదని మేము, పరిశ్రమల కేంద్రీకరణం కొందరు, వికేంద్రీకరణం కొందరు కోరుచు కాంగ్రెసు సభలలోనే వాదించుకొంటూవుంటే, కాంగ్రెసు ఎటుపోతుంది? ఈ సందర్భంలో కాంగ్రెసుని నడిపించగల సమర్థులని డా॥ పట్టాభిగారని వారిని ఎన్నుకొన్నాము. కనుక వారికి మనమందరము తోడ్పడాలి. డా॥ పట్టాభిగారు అనేక వ్యాపారసంస్థలు స్థాపించి, ఆంధ్రదేశంలో పరిశ్రమలే లేని నాడు ఆంధ్ర బ్యాంకు, ఆంధ్ర ఇంసురెన్సు కంపెనీలు స్థాపించి నిర్వహించిన అనుభవజ్ఞులు కనుక, స్వతంత్ర భారతంలో యీ నాడెంతో అభివృద్ధి కార్యక్రమం నడుపవలసిన సమయాన వీరు రాష్ట్రపతిగా నుండుట గొప్ప అదృష్టము." అని అధ్యక్షులు తొలుత నుడివిరి.

#### శ్రీ కళా వెంకట్రావుగారు

రివెన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు, 1920 ఫిబ్రవరిలో కాకినాడ విద్యార్థుల సభావేదికపైనుండి విద్యార్థిగ నున్న తనను పిలిచి, త్రివిధ బహిష్కార కార్యక్రమం అనుసరించి ఆ నాటినుండి చదువు మానేస్తున్నానని ప్రకటించమని కోరగ, తాను రెండో ఆలోచనలేక అట్లు ప్రకటించి ఆనాటినుండి వారి ననుసరించి దేశసేవ చేస్తున్నందున డాక్టరుగారు తమకు మార్గదర్శకులైన నాయకులనిరి. తన సూత్రాలకు భాష్యకారుడు పట్టాభి అని మహాత్మగాంధిగారే నుడివియుండిరి. గాంధిభావం అందరికి బోధపడునట్లు వ్యక్తం చేయగలవారు వేరొకరులేరు. కనుక గాంధిపద్ధతులను ప్రజలను నడిపించగల ఏకైక నాయకు డీయన. వీరు చేసిన సేవకు త్యాగానికి నేడు పట్టాభిషేకం జరిగింది. గత శతాబ్దంలో పనప్పాకం అనంతాచార్యులుగారు కాంగ్రెసు అధ్యక్షులయితే, యీ శతాబ్దంలో డా॥ పట్టాభిగారు ఆ పదవి నధిష్ఠించి తిరిగి ఆంధ్రులకు ఆ గౌరవం కలిగించిరి. వీరింకా 68 సం॥లు ఆరోగ్యంగా జీవించి ప్రజాసేవ చేయుదురుగాక."

శ్రీ మాగంటి బాపినీడుగారు, డా॥ పట్టాభిగారు క్రిప్సుగారిని డక్కాకొట్టించిన మేధావి, వీరు రాష్ట్రపతిగను, గవర్నరు జనరలుగా రాజాజీ యిద్దరు దాక్షిణాత్యులేగనుక మనమెంతో సంతోషింపదగినదనిరి.

ఎం. కె. వి. రెడ్డిగారు, డా॥ పట్టాభిగారు గొప్ప రాజకీయవేత్త, మేధావి గ్రంథకర్త, చరిత్రకారుడు గనుక, దేశీయులో సంగదగిన మహద్గౌరవము వారికొసంగబడెననిరి.

కె. మాధవమీననుగారు, తాము చిన్నపుడు గయా కాంగ్రెసు చూడబోతూ మరోయిద్దరితో కలసి జాతీయ కళాశాల చూచుటకు బందరునకు కట్టుగుడ్డలతో డా॥ పట్టాభిగారింటికి పోగా, "ఎందుకొచ్చారు నాయింటికెందుకొచ్చేరు" అని అడిగిరనియు, "ఈ ఊరులో మీ పేరొక్కటే తెలుసుకనుక వచ్చేము, అని చెప్పేసరికి, ముందు స్నానం, భోజనం చేయండని యింట్లోకి పంపిరనియు, పయికి దురుసుగాను కోపంగాను మాట్లాడినా నిండు హృదయంగల వారనియు, తెలిపిరి. షాఫీమహమ్మదుగారు హిందీలో ప్రసంగించినపిదప, బి. రామకృష్ణరావుగారు, కొన్నిలు అధ్యక్షులం తే జత్వ వర్చశ్వి అయిన డా॥ పట్టాభిగారు 114 వోట్లతో మాత్రం గెలిచిరనియు, అందు 60 మంది ఆటయితే మనమిరీతి గౌరవించేభాగ్యం లేకుండెడిదనియు, ఈ గెలుపుకి కామరాజనాడరు బృందము సహాయమే కారణంకనుక వారికభినందించవలసియున్నదనిరి. నాడారు గారు, రాష్ట్రపతి ఎన్నిక విషయంలో మన యందు గౌరవం ఉంచి డా॥ పట్టాభిగారిట్లు విజయవంతుని జేసిరో అట్లే ఆంధ్ర రాష్ట్ర విషయంలోగూడ ఆంధ్రులకు సహాకరింతురని ఆశించుచున్నామనిరి.

డా॥ యు. కృష్ణరావుగారు, తాము చిన్నపుడు ఊటీలో నుండగా పొరుగింట నివసించిన ఒక పెద్దాయన వెంట నొక చిన్నవానితో పోతూవుంటే "ఆత నెవరు?" ని. తనతండ్రి నడుగగ, "పెద్దాయన డా॥ పట్టాభి, వెంటనున్నవాడు సి. ఐ. డి" అని చెప్పెననియు, తెలుగులో నుపన్యసించుచు పలికిరి. ఆనాటినుండే యితనేదో చక్రవర్తి అంతవాడు లేకుంటే పోలీసువానిని ఎపుడూ వెంట ప్రభుత్వం వారు ఉంచుతారా అనుకొంటిననిరి. పట్టాభిగారు మంచి ఆరోగ్యవంతులనియు, వారినిచూస్తే 68ఏండ్లువుండునని లేమనియు చెప్పి, వారినెదిరించినవారు వారితో కలసి పనిచేసినవారు, అన్ని భావాలవారు నేడీసభలో చేరి వారి జన్మదినం జరుపుట గొప్ప శుభసూచన యనిరి.

శ్రీ బులుసు సాంబమూర్తిగారు, పట్టాభిగారు చేయిపెట్టని సంస్థ ఆంధ్రదేశంలో లేదనియు, తనకు మిత్రుడు బంధువు, తమవూరికి అల్లుడు అయినందున పురోహితునిగా వారిని "దీర్ఘాయుర్భవ..." అని ఆశీర్వదించుచున్నాననిరి.

శ్రీ అ. కాశీశ్వరరావుగారు 1916 నుంచి డాక్టరుగారితో తాను కలిసి పనిచేయుచుంటిననియు, వారు ఎల్లప్పుడూ కష్టపడి పనిచేసే అలవాటు గలవారుగనుక సముద్యం తభారంగా తోచదనియు చెప్పిరి. సి. విజయరాఘవాచారి, ఎస్. శ్రీనివాసయ్యంగారు తరువాత దాక్షిణాత్యులలో రాష్ట్రపతి గౌరవం, పొందింది వీరొక్కరేననిరి.

బి. గోపాలరెడ్డిగారు, దేశ రాజకీయములందు ప్రస్తుతపరిస్థితులలో కలిగిన అనేక రోగాలు నివారించుటకు తగినవైద్యులు డా॥ పట్టాభిగారనిరి. అన్యరాష్ట్రద్వేషాలు మతదురభిమానాలు పెరుగుచున్నవి. అవి పోగొట్టగలరు. నేడు స్వతంత్ర రాజ్యాంగానికి పునాదులు వేస్తున్నారు. వాటిని సక్రమంగా ఏరె వేయించగలరనిరి. బందరు జాతీయ కళాశాలలో చదువుకొన్నప్పటినుండి వారే నెదరుసుదుమనియు, తరువాత జెయిలులో కలసి యున్నపుడు గూడ తాము సొంతేకలుగా ఉన్నా వృద్ధులైన పట్టాభిగారు చుకుకు గానుండే, తమ గదులు గూడ వాత్సల్యంతో వచ్చి వర్ధి తమకు నిస్త కలిగించేవారనియు, చెప్పిరి.

ప్రయాగ నరసింహశాస్త్రిగారు రెండు పద్యాలు చదివిరి.

శ్రీ కామరాజనాడారుగారు, అరవ కాంగ్రెసు అధ్యక్షులు, డా॥ పట్టాభిగారు ఎన్నో ఏండ్లక్రిందటనే రాష్ట్రపతి కావలసియుండెను గాని, స్వతంత్ర భారతంలో ప్రథమ అధ్యక్షుడగుటకై అపుడు తప్పిపోయిందనిరి. స్వతంత్ర భారతంలో కాంగ్రెసు అధ్యక్ష పదవి చాల కష్టం. పూర్వం విదేశ ప్రభుత్వాన్ని ఎదిరించుటకు ప్రజలలో ఉద్రేకం కలిగించి చూడదిగుటు సులభంగా నుండేది. ఇపుడు కాంగ్రెసు ప్రభుత్వాలే అంతటావున్నాయి. ఎంతో చేస్తామని వాగ్దానాలు చేసేసేము. అవన్ని జరుగలేదు. ప్రజలసంతృప్తి చెందయున్నారు. కాంగ్రెసంటే తగ్గిపోతున్న ఉత్సాహాన్ని ప్రజలలో తిరిగ ఉద్దరించాలి. అధికారపదవులలో నున్నవారు ప్రజలను మరచిపోతారు. కనుక ప్రజల వాంఛలు, కోర్కెలు, అవసరాలేమిటో అధికారంలో నున్నవారికొక్కి చెప్పాలి. అపని ప్రజల తరపున పట్టాభిగారు అధ్యక్షునిగ చేయవలసియుండును. కనుక వారికి మనమంతా సహాయం చేయాలి. అని నాడరుగారు తెలిపిరి.

అధ్యక్షులు తమ ముగింపు ఉపన్యాసమునందు ఎవరో తమకొక ప్రశ్న పంపిరనియు, దానికి జవాబు చెప్పదలచలేదనియు, కొద్దిమంది ఆంధ్రులు పట్టాభిగారికి ఓటు చేయలేదంటే, 129 మంది యు. పి. వారు టాండనుకి ఓటుచేయక పట్టాభికి వోటుచేసిరంటేను, ప్రజాస్వామ్యసిద్ధాంతాని కది నిదర్శనమనియు, అందుకు చింతపడరాదనియు చెప్పిరి. నాడరుగారు పది సంవత్సరాల క్రితమే ఆంధ్రరాష్ట్రము ఏర్పడియుంటే రాష్ట్రప్రభుత్వంలో ఈ చిక్కులుండేవికావని భాషారాష్ట్ర విచారణసంఘం ఎదుట సాక్ష్యం చెప్పిరి. వారు ఆంధ్ర రాష్ట్రానికి తోడ్పడుచున్నారు. తమిళ కాంగ్రెసువారు ఆంధ్ర కాంగ్రెసువారు కూడ విభజన కోరుచున్నప్పుడు భాషారాష్ట్రసంఘంవారు, త్వరలో ప్రకటింపనున్న నివేదికయందు యిందుకు సుముఖంగానే తెల్పెదరని ఆశింపవచ్చును. డా॥ పట్టాభిగారు, దేశభక్త కొండవెంకటప్పయ్య పం. నాగేశ్వరరావు, ప్రకాశం గార్లను చిన్నప్పటినుండి నాయకులుగా నెంచుకొని ఏళలవృద్ధనిపతె పూజించుచున్న తన బోటివారు పట్టాభిగారిని బలపరచుటం గొప్ప సమాచారం కాదు. డా॥ పట్టాభిగారు గోపాలరెడ్డిగారి పుస్తకాలు చదివరని చెప్పిరి. పుస్తకాలే గాదు; మనందరి మనసులుగూడ సర్దగలవ్యక్తి డా॥ పట్టాభిగారనిరి.

## పచ్చయ్యప్ప హైస్కూలులో

చెన్నపట్నం, నవంబరు 25: పచ్చయ్యప్ప హైస్కూలులో నిన్న సాయంకాలం డా॥ పట్టాభిగారి 69-వ జన్మదినోత్సవం శ్రీ బులుసు సాంబమూర్తిగారి అధ్యక్షతక్రింద జరిగింది. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు దాదాపుగంటసేపు ఉపన్యసించారు. స్కూలుఫైనల్ విద్యార్థి వి. సుబ్రహ్మణ్యం మాతృగీతాలాపన అనంతరం పాఠశాల హెడ్మాస్టరు శ్రీ వెంకట్రాయపిళ్లెగారు అధ్యక్షులకు ఉపన్యాసకులకు స్వాగతవచనం చెప్పారు. అధ్యక్షులు శ్రీ బులుసు సాంబమూర్తిగారు తెలుగులో ఉపన్యసిస్తూ డా॥ పట్టాభిగారు కాంగ్రెస్ పెద్దలే కాకుండా తమ ఊరివారి అల్లుడైనందువల్ల కూడా తమ ఆదరసన్మానాలకు పాత్రులని చెప్పారు. డా॥ పట్టాభిగారు పేదరుడైనా తాము భరించవలసిందే నన్నారు. శ్రీ కాశేశ్వరరావుగారు ప్రపంచసమస్యల్ని, భారతదేశ నాయకులు పరిష్కరించవలసిన సమస్యల్ని గురించి దాదాపు గంటసేపు ఉపన్యసించారు. ప్రస్తుత పరిస్థితులలో రాష్ట్రపతి అయిన డా॥ పట్టాభిగారి గురుతరబాధ్యతని గురించి వివరించారు. డా॥ పట్టాభిగారు ఈవయసులోకూడా గ్రంథపఠనంలో చూపే ఆసక్తి విద్యార్థులకు ఆదర్శప్రాయమైనదని చెప్పారు. ఆంధ్రుడు రాష్ట్రపతి కావాలనే వాంఛ ఇప్పటికి తీరిందన్నారు. అయితే ప్రత్యేకరాష్ట్రవాంఛ ఇంకా తీరలేదు. అది ఇప్పుడు కాకపోతే ఎప్పుడో ఒకప్పుడు రాకతప్పదని చెప్పారు. శ్రీ బులుసు సాంబమూర్తిగారు సభాకార్యక్రమాన్ని ఇంగ్లీషు ఉపన్యాసంతో సమాప్తి చేశారు. పచ్చయ్యప్ప హైస్కూలు విద్యార్థి సంజీవి గాంధీజీని శ్రీకృష్ణునితో పోల్చి వ్రాసిన గీతాన్ని చదివాడు. తెలుగు ఉపాధ్యాయులు శ్రీ గణేశశాస్త్రి కృతజ్ఞతాభినందనవచనాలు చెప్పారు.

## ఆంధ్రవిజ్ఞాన సమితి

'కాంగ్రెసులో "ఆంధ్రరాష్ట్రము" ఏర్పడుటకు డాక్టరుగారి కృషియే కారణము'; 'ఒక గంభీరవిషయమును నిశితముగా విమర్శించుటయేగాక, మేథావంతముగా వ్యాఖ్యానించి, తిరిగి దానిపై చలోక్తికూడా చేయగలరు'; "ముఖపు మాటయనునది పట్టాభిగారికి ఏకోశమునను లేదు. లేకున్న వారెన్నడో కాంగ్రెసు అధ్యక్షులయ్యేడివారు"; '68 ఏండ్లువచ్చినను, సంపూర్ణారోగ్యముతో బొంగరమువలె తిరుగుచున్నారు. మిగిలిన 32 ఏండ్లనూ ఇదే ఆరోగ్యములో వారు పూర్తి చేయగలరని గట్టిగా నమ్మవచ్చును'— అని నిన్నసాయంత్రము ఆంధ్రవిజ్ఞాన పరిషత్తులో డా॥ పట్టాభి సీతారామయ్య జన్మదినోత్సవ సందర్భమున శ్రీయుతులు కల్లూరి చంద్రమౌళి, ప్రభృతులు ఉపన్యసించుచూ అనిరి.

ప్రార్థనానంతరము శ్రీ చంద్రమౌళి ప్రసంగించుచూ, మనకుగల భాగ్యమును గురించి పదే పదే భక్తి ప్రేమలతో చెప్పుకొనుట తప్పుకాదనిరి. డాక్టరుగారు గాంధీజీకి నిరుపమమైన అనుచరుడు. అయినా గాంధీజీతోకూడా నిర్మొగమాటముగా మాట్లాడువారు. ఎట్టి సమస్యనైననూ, పదులాగా వలిచి, తొనలు తొనలుగా విభజించి విశదపరచుట డాక్టరుగారి విశిష్టత. ఈ కారణముగా, ఆయన గాంధీమత భాష్యకారుడు కాగలిగిరి. జాతీయమహాసభ చరిత్రను రచియించుటకు పట్టాభిగారినే నియమించుటకిదియే కారణము. ఆయనను అనేకపదవులు వరించినవి—కాని ఆయన ఆ పదవులను; గాంధీజీ అనుమతి లేక స్వీకరింపనైనను. నాయకుని ఋజు, చట, తప్పక అనుసరించుటయే పట్టాభిగారి మతము. కాంగ్రెసులో "ఆంధ్రరాష్ట్రము" ఏర్పడుటకు డాక్టరుగారి కృషియే కారణము. వారిని అధ్యక్షస్థానములో నుంచినందుకు, మనము వారి గౌరవమును కాపాడవలెను. మన కోర్కెలను విశాలయుతము చేసికొని ప్రవర్తించుట ముఖ్యము అని చంద్రమౌళిగారనిరి.

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు మాట్లాడుచూ పట్టాభిగారికి ఆంధ్రలోకంకంటే, మిగిలిన రాష్ట్రములందే ఎక్కువ పలుకుబడి యున్నదనిరి. మొన్నటి ఎన్నికలే విషయమును ఋజువు చేయుచున్నవి. డాక్టరుగారు నాయకుడేగాక ప్రతిభావంతుడైన రచయిత. ఒక గంభీరవిషయమును నిశితముగా విమర్శించుటయేగాక, మేథావంతముగా వ్యాఖ్యానించి, తిరిగి దానిపై చలోక్తులు కూడా చేయగలరు. అతి సామాన్య విషయముపైన ఎంతోరంజకముగా మాట్లాడగలరు. అని వెంకటేశ్వరరావుగారనిరి.

డాక్టరు సీతాపతి మాట్లాడుచూ, ఈ అధ్యక్షపదవి వలన సీతారామయ్యగారికి అదనముగా లభించు అలంకారమేదియును లేదనిరి. రాష్ట్రపతిత్వమునకు ఏ ఆటంకములు, ఏ అవకాశములు కలవో డాక్టరుగారికి బాగుగా తెలియును. ఆయనను రాష్ట్రపతిత్వమై హెచ్చరించు నవసరములేదు. ఆలస్యము జరిగినచో, దానికి కారణము ఆయన అలసత్వము మాత్రము కాదు. డాక్టరుగారు 68 ఏండ్లు వచ్చినా సంపూర్ణారోగ్యముతో బొంగరమువలె తిరుగుచున్నారు. మిగిలిన 32 ఏండ్లను ఇదే ఆరోగ్యముతో వారు పూర్తి చేయగలరని గట్టిగా నమ్మవచ్చును అని సీతాపతిగారనిరి.

శ్రీ కళా వెంకట్రావు ప్రసంగించుచూ, డాక్టరుగారికి ముఖప్రీతికై మాటలాడు అలవాటు లేదనిరి. ఆ తత్వమే ఉన్నచో ఎన్నడో కాంగ్రెసు అధ్యక్షులయ్యేడివారనిరి. వచ్చిన మనిసి కూర్చొనకముందే, వక్షమును కరిపించినట్లు, మంచి చేదు అనకుండగనే గడగడా మాట్లాడుదురు. దానితో వచ్చిన వారికి అసహ్యము పుట్టును. చివరకు తరకవచ్చునది ఈ మాటలే అయిననూ, ముందుగా మాత్రము విసుగించుతవి. నన్ను కేంద్రశాసనసభా కాంగ్రెసు పార్టీలో సభ్యునిగా పెట్టిరి తీసివేయుమనినవని, నిర్దాక్షిణ్యముగా, నిర్మొగమాటముగా, పట్టుపట్టిన వాదించి, నెహ్రూగారి సంతకాలపై వ్రాత తెచ్చిరి. ఈ పనివలన, ముందు ముందు ఏమియు లోపము చేసెమోనని జంకలేదు. పంయుక్తపుటల కాంగ్రెసు చరిత్రమ సైలులోకూడా చెప్పెని, చిన్న కొరతములపై వ్రాసిరి. తమవాడు చెప్పవలెనన్న, తలపు కొన్ని పులుము కొన్న చేసులను కనుక కొనుటకు మదురగా కొన్నకు గచుకొనుట మిత వ్యయమునకు పునాది. అని డాక్టరుగారి భావము. నేటివరకు ఆంధ్రసంస్థలలో నూడింటిని డాక్టరుగారే నిర్మించిరి. అనేకులు చిన్నపెద్దవిషయము లన్నింటిలో సలహాకై ఆయనవద్దకు వత్తురు. 564 సంస్థానములను సర్దార్జీ పరిపాలనాయుతముగా ఏకము చేయుటకు, ప్రజాభిప్రాయమును సంఘటితము చేసి డాక్టరుగారు పునాదివేసిరి. పూరుకాంగ్రెసు మన యింటిలో పెళ్లివలె వున్నది. వారికి సేవచేయు అవకాశము మనకు ఇంకనూ ఎంతయోకాలము ఉండవలెనని ఆశించుచున్నానని వెంకట్రావుగారనిరి.

శ్రీ చాగలి హనుమంతరావుకూడా మాట్లాడిన తరుపరి, శ్రీ కె. శ్రీరామమూర్తి వందనములతో కార్యక్రమము ముగిసెను.

# డాక్టరు పట్టాభి జన్మదినోత్సవం

## మిత్రుల అభినందన పరంపరం

న్యూఢిల్లీ, నవంబరు 24: నూతనరాష్ట్రపతి డా॥ పట్టాభిగారికి నేటితో 68 సంవత్సరములు నిండి 69 వ ఏడు ప్రారంభమైనది. దేశము నలుదిశలనుండి అనేకమంది మిత్రులు, దీర్ఘాయువు గంటలు కావలెనని అభిలషించుచు వారికి శుభాకాంక్షలను అందజేసిరి. నేడు చాలామంది మిత్రులు వారిని వాసమునకు వెళ్లి శుభాశీస్సులను పట్టాభిగారికి తెలిపిరి. సీతారామయ్య పంతులుగారు నేడు తమ జన్మదినోత్సవమును ప్రశాంతముగా ఇంటివద్దనే గడిపిరి.

జన్మదినోత్సవ సందేశమేదైన ఇచ్చెదరా అని యునైటెడ్ ప్రెస్ విలేఖరి ప్రశ్నించగా డా॥పట్టాభిగారు ఛలోక్తిగా యిట్లనిరి:

"జన్మదినోత్సవం సహజంగా రెండు రకాలుగా వుంటుంది; కాలం అర్థాంగికి చెందినదిగా గాని, లేక యీవర్ప్రపంచానికి చెందినదిగాగాని వుంటుంది. నాది మాత్రం మొదటిరకంలోనే వస్తుంది."

# పాకిస్తాన్ విదేశాంగ మంత్రి బెదరింపు

(1-వ పేజీ తరువాయి)

సత్వరము నివారించుటకు చర్యతీసుకొనబడవలెను."

## హైదరాబాద్, కాశ్మీరులపై తిరిగి చర్చలు

పారిస్, నవంబరు 24: భద్రతా మండలి రేపు హైదరాబాద్, కాశ్మీర్ వివాదలను గురించి తిరిగి చర్చలు ప్రారంభించును.

భద్రతామండలి గత సెప్టెంబరు 28 వ హైదరాబాద్‌ను గురించి పరిశీలన జరిపినప్పుడు, హైదరాబాద్ ప్రభుత్వ విదేశాంగ మంత్రి నవాబ్ మొయిన్ నవాజ్ జంగ్ నాయకత్వాన వచ్చిన హైదరాబాద్ ప్రతినిధివర్గ అర్హతార్హతలను గురించి చర్చ జరిపెను.

నిజాం నవాబు తన ఫిర్యాదును ఉపసంహరించుకుంటూను, తన ప్రతినిధివర్గ యోగ్యతలను రద్దు చేయుచును అప్పుడు భద్రతామండలికి ఒక లేఖ నంపెను.

హైదరాబాద్ ఫిర్యాదును మండలి ఎజెండానుండి పూర్తిగా తొలగించవలసిందిగా భారత ప్రతినిధివర్గం అభిప్రాయపడినది. కాని యీ అంశం మండలి ఎజెండాలోని అప్రధాన విషయాల పట్టికలో చేర్చబడినట్లు అప్పుడు కనుపించినది.

పాకిస్తాన్ విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖాన్, హైదరాబాద్ పరిస్థితి నానాటికి అధ్వాన్నమై పోవుచున్నదని తనకు వార్తలు వచ్చుచున్నవనీ, అందుచే వీటినిగురించి చర్చించుటకుగాను సమావేశమును ఏర్పాటు చేయవలసిందనీ, నవంబరు 20 వ భద్రతామండలి అధ్యక్షునకు ఒక లేఖ వ్రాసెను. పరిస్థితిని చక్కబరచుటకుగాను మండలి తక్షణం చర్య తీసుకొనుట అవసరమని జఫ్రుల్లా తెలియజేసెను.

మండలి పంపిన 5 గురితో కూడిన ఉపసంఘం కాశ్మీరు వెళ్లి పరిస్థితులను సమగ్రంగా స్వయంగా పరిశీలించి, పరిష్కార మార్గములను గురించి ప్రయత్నించుచుండుటచే కాశ్మీరుసమస్య కొన్ని నెలలపాటు చర్చకు రాకుండా అట్లా ఉండిపోయింది.

ఉపసంఘం జనీవాకు తిరిగి వచ్చి, కొద్ది రోజులక్రిందట సమస్యనుగురించి తన ప్రథమ తాత్కాలిక నివేదికను భద్రతా మండలికి సమర్పించెను.

కాశ్మీర్ ప్రాంతంలోని సంఘటనల వివరములు, రాజీ పరిష్కారమునకు ఉపసంఘం జరిపిన ప్రయత్నముల వివరములు యీ నివేదికలో పొందు పరచబడినవి. ఇందులో ఏ విధమైన సిఫార్సులు, నిర్ణయాలు చేయబడలేదు. కాని ప్రస్తుతం ఉపసంఘం జమ్మూ, కాశ్మీరులలో ప్రజా నిర్ణయం తీసుకొనవలెనన్న సూచనలపై పనిచేయుచున్నదని తెలియుచున్నది.

ఉపసంఘం దేశంలో లేని కాలంలో ఇండియా పాకిస్తాన్ ప్రభుత్వముల మధ్య పరిస్థితులు విషమించకుండునట్లుగా ఉండెదమని రెండు ప్రభుత్వములు యిచ్చిన వాగ్దానమునకు భంగకరంగా భారతప్రభుత్వం ప్రవర్తించుచున్నట్లు ఏగాదా ప్రాంతంలోని యిటీవలి పరిస్థితులు తెలియజేయుచున్నవని ఆరోపించుచు సర్ జఫ్రుల్లాఖాన్ కాశ్మీర్ ఉపసంఘమునకు కొద్దిరోజులకిందట ఒకజాబు వ్రాసెను.

కాశ్మీరులోకి ఇండియా అదనంగా సేనలు పంపించినదనీ, మిలిటరీ బలం ద్వారా కాశ్మీర్‌లో నిర్ణయం జరుపవలెనని భారతప్రభుత్వం ప్రయత్నించుచున్నదనీ భారతప్రభుత్వ యీచర్యలవలన పాకిస్తాన్ తప్పనిసరిగా ప్రతీకారమునకు పూనుకొనవలసివచ్చునని అతడు హెచ్చరించెను.

ఉపసంఘం యీ లేఖను భద్రతామండలి అధ్యక్షునకు అందచేసెను. అతడు దానిని రేపటి ఎజెండాలో చేర్చెను. భద్రతామండలి రేపు డా॥ జోసెఫ్ (? ) అధ్యక్షతను సమావేశమగును.

## భారత అధికార వర్గాల వైఖరి

న్యూఢిల్లీ, నవంబరు 24: కాశ్మీరు సమస్యపై పాకిస్తాను విదేశాంగమంత్రి సర్ మహమ్మద్ జఫ్రుల్లాఖానుగారు భద్రతా సంఘమునాశ్రీ ఒక లేఖ వ్రాయుచు కాశ్మీరులో పాకిస్తాను భారతసైన్యములు ఎదురునారి జరుపునని, యుద్ధము యితర ప్రాంతములకు విస్తరింపబడునని బెదరించిరి. ఈ బెదరింపులకు న్యూఢిల్లీ అధికార వర్గములవారు అనవసర ప్రాముఖ్య మొసంగ నక్కరలేదని వ్యాఖ్యానము చేయుచున్నారు. ఈ వర్గములవారు యీ క్రింది విషయముగా చెప్పుచున్నారు: (1) యుద్ధవిరమణ ఒడంబడికను తిరస్కరించుట మూలమున రాజీ కుదురు అవకాశము లేదు. (2) కాశ్మీరులో భారతీయసైన్య మెదురుదాడి చేయుచున్నను పాకిస్తాను ఇదివరకు యిదివరకే ఏర్పడియున్న స్థితిని ఇప్పుడు అలస్యముగా అంగీకరించుట తప్ప అన్యము కాదు. ఇదివరకే యేర్పడియున్న స్థితిని పాకిస్తాను అధికారికముగా అంగీకరించవలసియున్నదని దానికర్థము. ఈసవాలును అంగీకరించుట తప్ప భారతదేశమునకు మార్గాంతరము లేదు. భారతసేనలు కాశ్మీరులో విజృంభించుచున్నవని ఆరోపణ విషయమై ఈ వర్గముల వారిట్లు చెప్పుచున్నారు. కాశ్మీరుపై దండయాత్రచేసిన దుండగీండ్రను ఒక్కరినీ గూడ లేకుండ తరిమివేయబడునరకు, పాకిస్తాన్ సైనికులందరు పాకిస్తానునుండి తరిమివేయబడునరకు యీ ఉద్యమం సాగించుట భారతప్రభుత్వ విధానమైయున్నది. ఈ విధానమిదివరకే పార్లమెంటులో ప్రకటింపబడినదియై యున్నది. ఇట్టి కృషిని భారతప్రభుత్వమువారెన్నటికిని విరమింపరు. అ. ప్రె.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 25:

వేరు సెనగ: (581 పౌ 1-కి ఎప్పు కొస్తాగిడ్డంగులు) మెషిన్(సేల్సుటాక్సుతో సహా) బజారు(పాతది) రు. 149-0-0

అఖరునద్ద రు. 150-8-0

వేరుసెనగనూనె: ఎక్సుపెల్లర్ (టాల్‌కోల్)

(సేల్సుటాక్సుతోసహా) రు. 312-0-0

(గ్యారంటీ) 314-0-0

ఆముదం బజారుడెలివరీ ఎక్సుపెల్లర్ వర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలకి రు. 360, 363

కొబ్బరి కాయనూనె (39 పౌను గల డబ్బా) రు. 33 8.9 34.0-0

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు ధరలు 1-కి ఎప్పు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు 76-12-0 పెట్టా బంగారు తులం 113 12 0 మూసబంగారు 112 0 0 సవరంకి తులం 100-3 (?) 177 8.0 వెండి తులం 1 13 0.

### పంచదార

"కౌన్పూరు" (2 అందరు) రు. 105-8-0, 106-8-0

బూరా (25 పౌన్లు) రు. 11-4-0

కలకండ (25 పౌన్లు) రు. 16-4-0

## మదరాసు తోళ్ల మార్కెటు

చెన్నపట్నం, నవంబరు 25:—

పదునుచేసిన ఆవుతోలు
(5 నుండి 7½ పౌ) రూ. 2-1-6 నుండి 2-2-6
" (8 నుండి 8½ పౌ) రూ. 1-13-6 నుండి 2-0-6
" (10 నుండి 12 పౌ) రూ. 1-13-0 నుండి 1-15-0

పదునుచేసిన గేదతోలు
(10 నుండి 13 పౌ) రూ. 1-5-0 నుండి 1-6-6
" (5 నుండి 6½ పౌ) రూ. 1-10-0 నుండి 1-13-0

పదునుచేసిన ఆవుదూడచర్మం
(1½ నుండి 2½ పౌ) రూ. 3-0-0 నుండి 3-2-0

పదునుచేసిన గేదదూడచర్మం
(2 నుండి 2½ పౌ) రూ. 2-0-0 నుండి 1-1-0

పదునుచేసిన మేకతోలు
(5 నుండి 7 పౌ) రూ. 5-4-0 నుండి 5-12-0
" (8 నుండి 9 పౌ) రూ. 4-8-0 నుండి 4-12-0
" (10 నుండి 12 పౌ) రూ. 4-0-0 నుండి 4-4-0

పదునుచేసిన గొర్రెచర్మం రూ. 5-4-0 నుండి 6-3-0

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 24:

డిశంబరు 31.87 31.87 మార్చి 31.84/31.81 మే 31.65/31.66 జూలై 30.87/31.87 అక్టోబరు 28.66/నా. డిశంబరు 23.13/నా. మార్చి 28.2/నా. మే .7 9/నా

ఇండ్లకు 32.29

డిశంబరు (గరిష్ఠం) 31.93

(కనిష్ఠం) 31.80

### డిసెంబరు వాయిదా ధరలు

నేటి ప్రారంభం 31.93

ముగింపు 31.87

# "ప్రాచ్యదేశాలకు యంత్రసామగ్రి

## లభించటంలేదని దూర ప్రాచ్య ఆ. వ్య. సంస్థ ప్రకటన

వాషింగ్టన్, నవంబరు 23: "దూర ప్రాచ్య దేశాలకు న్యాయంగా రాదగినన్ని యంత్రసామగ్రులు లభించటం లేదని ఆ ప్రాంతాల్లో అభిప్రాయం ప్రబలి ఉన్నది. ఆ ప్రాంత ఆహారావసరాల విషయమై ప్రపంచదేశాలు తగిన శ్రద్ధ తీసుకోవలెను. తగినంత సామగ్రి పరికరాలు లభ్యమయితే దూర ప్రాచ్యదేశాల అభివృద్ధికి చాల అవకాశాలున్నవి." అని ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థ యొక్క దూరప్రాచ్య ప్రాంతీయసంఘం తన నివేదికలో తెలియజేసినది.

ఈ ప్రాంతాలలో గల సాగుబడి భూమిని ఇంకా సక్రమంగా ఉపయోగించటం, బంజరుభూములను సాగుబడికిందకు తీసుకొనిరావటం అనే అంశాలు ఈ నివేదికలో ప్రధానంగా చర్చించబడినవి. ఉత్పత్తి పెరగవలెనంటే, దేశప్రభుత్వాలు రైతులకు అప్పులు ఇవ్వటానికి సక్రమ సంస్థలను నెలకొల్పవలెనని సూచించబడినది. పంటలకూ పశువులకూ మిడతలు మొదలయిన చీడలవల్లనూ, దోమ్మ మొదలయిన తెగుళ్ళవల్లనూ నష్టంకలగకుండా కాపాడుటకై చూడవలెననీ, వాటిని నివారించటానికై దూరప్రాచ్యదేశాలన్నీ కలిసి ప్రయత్నించవలెననీ ఆ నివేదిక సూచించినది: ఈ దేశాలు భరిస్తున్న అతి తక్కువ ఆహారరేషన్ల విషయమై తిరిగి పరిశీలన చేయవలసివున్నదని నివేదిక సూచించినది.

ఇవికాక ఈ నివేదికలో ఈక్రింది ముఖ్యసూచనలు వున్నవి:

(1) ఈ దేశాలలో భూమి అమరిక విధానాలను సంస్కరించవలెను.

(2) అన్ని దేశాలలోనూ ఆహార సలహా శాఖలను స్థాపించి పరస్పరం సంప్రదించుకొనటం అవసరం.

ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థలో సభ్యత్వంకొరకు ఇస్రాయేల్ దరఖాస్తును ప్రపంచ ఆహార వ్యవసాయసంస్థ సర్వసభ్యసమావేశం నేడు కార్యవర్గానికి ఉపహరించినది.

### వినుకొండ తాలూకా కాంగ్రెస్

తెనాలి, నవంబరు 18: గుంటూరుజిల్లా కాంగ్రెసు కార్యవర్గం ఈనెల 6 న సమావేశమయినప్పుడు, వినుకొండతాలూకాలో శ్రీ కూచినపూడి కోటయ్యగారు అధ్యక్షులుగను, శ్రీ గోనుగుంట్ల బ్రహ్మయ్యగారు కార్యదర్శిగను ఎన్నికయిన కార్యవర్గమును సరియైనదిగా గుర్తించుచూ తీర్మానించడమైనదని అధ్యక్షులు వ్రాసిరి.

### శ్రీ వెంకటేశ్వర కళాశాల

తిరుపతి, నవంబరు 21: తిరుపతి లో శ్రీ వెంకటేశ్వర కళాశాలకు క్రొత్తభవనము నిర్మించు ఖర్చులో ప్రభుత్వంవారు సగం గ్రాంటుఇవ్వవలసినదిముఖ్యాంశములో నేరులో చెప్పుటకుగాను, తిరుపతి దేవస్థానం కమిటీ సభ్యులు, శ్రీ బి వీరాస్వామి నాయుడుగారు కమిషనర్, శ్రీ సి. అన్నారావుగారు విద్యామంత్రి శ్రీ అవినాశిలింగంచెట్టిగారి వద్దకు రాయబారం వెళ్లిరి. మంత్రిగారు, ప్రస్తుతం సగం గ్రాంటు యిచ్చుటకు వీలు లేదని యీ లంప్ సం గ్రాంటుగా అధికపక్షం 75000/- ఇచ్చుటకు ఏర్పాటుచేశామని సెప్పినట్లు తెలియుచున్నది.

భవన నిర్మాణ పనులుకూడ అతిత్వరలో దేవస్థానంవారు జరిపి 2 సం॥ లోపు గానే పూర్తి చెయ్యబడుతుందని నమ్మబడుచున్నది. స్వ. వి:

### ఫాకల్టీస్ అధ్యక్షులు

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మెడిసిన్, సైన్సు, కామర్సు శాఖల ఫాకల్టీస్ అధ్యక్షులుగ వరుసగ, డాక్టర్ ఎన్. జి. పండాలై, సర్. చంద్రశేఖర వెంకట్రామన్, కె. కె. దాస్‌గార్లు ఎన్నిక అయిరి.

# ఆస్తుల అన్యాక్రాంత నిషేధ ఉత్తరువు

## హైదరాబాద్ ప్రభుత్వచర్య

హైదరాబాద్, నవంబరు 28: హైదరాబాద్ ప్రభుత్వం జారీచేసిన ఆస్తుల అన్యాక్రాంత నిషేధ ఉత్తరువువలన లాయక్‌అలీ మంత్రివర్గంలోని సభ్యులు, ఐక్యరాజ్యసమితి హైదరాబాద్ ప్రతినిధివర్గంలోని సభ్యులు, అధికార్లు, అనధికార్లు కలసి మొత్తం 77 మంది దెబ్బ తినగలరు. పై ఉత్తరువు ప్రకారం యీ వ్యక్తులు తమ చరస్థిర ఆస్తులను బ్యాంకులకు గాని, యితరులకు గాని బదలీచేయుటకు వీలులేదు. ఈ వ్యక్తులలో మీర్ లాయక్‌అలీ, పింగళి వెంకట్రామారెడ్డి,నవాబ్ మొయిన్‌నవాజ్ జంగ్, ఫజల్‌నవాజ్ జంగ్, రాజా మోహన్‌లాల్, అబ్దుల్ హమీద్‌ఖాన్, అబ్దుల్‌రహీం, యామిన్‌జుబేరి, ఇక్రముల్లా, శంకరరావు పుల్సికార్, గోవిందరావు చాద్వేకార్, లండన్‌లో లోగడ హైదరాబాద్ ఏజెంటు జనరల్‌గానున్న నవాబ్‌మీర్ నవాజ్ జంగ్, కరాచీలో లోగడ హైదరాబాద్ ఏజెంటు జనరల్‌గానున్న ముష్తాక్ అహమ్మద్, లాయక్‌అలీ ప్రభుత్వంలో విదేశాంగశాఖ కార్యదర్శిగానున్న జహీర్ అహమ్మద్, ఐక్యరాజ్యసమితి హైదరాబాద్ ప్రతినిధివర్గ సభ్యులు ప్రొఫెసర్ యూసఫ్ హుస్సేన్‌ఖాన్, శ్యాంసుందర్, లాయక్‌అలీ ప్రభుత్వంలో పోలీసు డైరెక్టరు జనరల్‌గానున్న నవాబ్ దీన్‌యార్ జంగ్, నలుగురు సుబేదార్లు, అజీజ్ షైఫా, సంస్థానకాంటు మాజీ షేర్‌జంగ్ డైరెక్టరు ఖాన్‌బహదూర్ వి. టి. తారాపోరేవాలా, ఖాన్‌బహదూర్ బర్కత్ అలీ, రాజా ఉద్దీన్, లాయక్‌అలీ ప్రభుత్వంలో పబ్లిక్ రిలేషన్సు ఆఫీసర్‌గానున్న కె. ఈశ్వరదత్తు, ప్రచారశాఖ మాజీ కార్యదర్శి హమీరుద్దీన్‌ఖాన్, ప్రచారశాఖ మాజీ స్పెషలాఫీసరు డెస్మండ్‌యంగ్, ప్రచారశాఖ మాజీ డెప్యూటీ డైరెక్టరు గార్డెన్ బరాస్, నిజాం సంస్థానరైల్వే మాజీ జనరల్ మానేజర్ మహమ్మద్ ఆలం, తకీఉద్దీన్, ఎస్. ఎం. యూనూస్, స్థానిక స్వపరిపాలనశాఖ మాజీ కార్యదర్శి జౌహర్‌సిద్దికీ, 'ప్రజ' పత్రికాసంపాదకుడు సర్దార్ మోహన్‌సింగ్, భద్రాచలం తాసిల్దారు విష్ణుశేషురావు, శాసనసభ డెప్యూటీ అధ్యక్షుడు మహమ్మద్ అలీపాషామీరా కూడ ఉన్నారు. పై ఉత్తరువు పాంఫీకంపెనీ, యునైటెడ్ కమర్షియల్ కార్పొరేషన్, బొంబాయిలోని హైదరాబాద్ కోఆపరేటివు కమర్షియల్ కార్పొరేషన్ ఏజెంటు ఎం. ఎ. ఖాజామిలకు కూడ వర్తించును.

# భాషాప్రాంత విభజన

## ఇప్పుడు ఆలోచింపవలసిన సమస్యకాదని తీర్థా ప్రకటన

హోసపేట, నవంబరు 22: హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు అధ్యక్షులు స్వామి రామానందతీర్థగారు నిన్న మునిరాబాదు, గనిగెర, కొప్పళం గ్రామాలకు వచ్చిరి. గ్రామ ప్రజలు వారికి ఘనముగ స్వాగత మొసంగిరి. తీర్థగారు తుంగభద్రా ప్రాజెక్టుపనులను పరిశీలించిరి. స్వామీజీ ఆగమన సందర్భంలో కొప్పళంలో తాలూకాఫీసువద్ద బహిరంగసభ ఏర్పాటు చేయబడెను. గ్రామస్తులు తీర్థాగారికి స్వాగత పత్రము సమర్పించిరి.

రామానందతీర్థగారు ప్రసంగించుచు సంస్థాన కాంగ్రెసు ఆశయములను గురించి వివరంగా చెప్పిరి. సంస్థానమును భాషాప్రాంతాలుగా విభజించి యూనియన్‌లోని ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతాలలో చేర్చ్చువిషయమును ప్రస్తావించుచు యిది ప్రస్తుత మాలోచింపవలసిన విషయము కాదనిరి. సంస్థాన కాంగ్రెస్ ఆశయమంతా నిరంకుశ పరిపాలనను అంతమొందించి ప్రజాస్వామ్య ప్రభుత్వమును ప్రతిష్ఠించుటయేననిరి. హిందూ, ముస్లింలు గతమును విస్మరించి సఖ్యతతో నుండవలసినదని ఉద్బోధించిరి. విద్యాధికులు, అధికారులుసామాన్యప్రజానీకం సేవకులనియూ కాబట్టి వారు యీ దృష్టితో ప్రవర్తించవలసి యుంటుందనియూ చెప్పిరి.

[ఇతర హైదరాబాద్ వార్తలు 4 వ పేజీలో]









Edited, Printed & Published by S. Sambhu Prasadat the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G T. Madras